73

# సృజన

జారు ప్రభుత్వాన్ని కూల్చిన అరోరాఫిరంగి ధ్వని
ఇంకా మా చెవుల్లో మార్మోగుతూనేవుంది
వింటర్ ప్యాలస్‌పై నీవు నడిపించిన మెరుపు దాడి
మమ్మల్ని ఇంకా ఉత్తేజితుల్ని చేస్తూనే వుంది
యుద్ధాన్ని అంతర్యుద్ధంగా మార్చిన నీ విజ్ఞత
మమ్మల్ని ప్రభావితం చేస్తున్నది.



నవంబర్ 77

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

మాసపత్రిక

**73**

అక్టోబర్ విప్లవ 60వ వార్షికోత్సవ ప్రత్యేక సంచిక

నవంబర్ 1977

---

## నేనే లెనిన్

జగతిలో ఏ మూల విన్నా
లెనిన్ అడుగుల సవ్వడి
నా ప్రతి రక్తకణంలో
నేడున్నాడున్నాడు లెనిన్
నిర్వీర్యతకు
ఇచ్చాను చెల్లు చీటీ
తిరుగుబాటు
రొదచేస్తోంది నా హృదయంలో
లెనిన్ నేను, నేనే లెనిన్
అనిపిస్తోంది నేడు.

సుకాంత భట్టాచార్య

---


నిర్వహణ

'సాహితీ మిత్రులు'

సంవత్సర చందా రు. 15 ఈ సంచిక రు. 2

# సృజన

నవంబర్ 1977 మాస పత్రిక 73



ముఖచిత్రం :

'మీరు అంతర్యుద్ధంలో పేరు నమోదు చేయించారా ?'

డి. మూర్ వార్ పోస్టర్

SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh Hyderabad. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

# అక్టోబర్ విప్లవం

అక్టోబర్ విప్లవంగా చరిత్రలో సుప్రసిద్ధమైన రష్యన్ విప్లవం సవరించబడిన కేలండర్ ప్రకారం నవంబర్ 7 న కమ్యూనిస్టు పార్టీ (బోల్షివిక్) నాయకత్వంలో విజయవంతమైంది. ప్రపంచ పురోగామి ప్రజలందరికీ ఈ నాటికీ ప్రేరణగా, ఉత్తేజంగా, ప్రజా ఉద్యమాలకు, పోరాటాలకు ఊపిరిగావున్న ఈ విప్లవ విజయం అరవై ఏళ్ళనాటిది.

1917 ఫిబ్రవరిలో జార్ చక్రవర్తుల పతనంతో అధికారం తాత్కాలికంగా బూర్జువావర్గం చేతుల్లోకి పోయింది. కార్మికవర్గ ప్రయోజనాలను, రైతాంగం, అశేష పీడితవర్గాల ప్రయోజనాలను బూర్జువాలు నెరవేర్చలేరని, విప్లవాలకు నాయకత్వం వహించే అర్హత వాళ్ళు కోల్పోయారని లెనిన్ ఏనాడో చెప్పాడు.

ప్యారిస్ కమ్యూన్ అనుభవంతో శక్తివంతమైన దృఢమైన కార్మికవర్గ పార్టీ లేకుండా కార్మికవర్గ విప్లవం విజయవంతం కాదని చారిత్రక, శాస్త్రీయ విశ్లేషణచేసి బోల్షివిక్ పార్టీని స్థాపించి సాయుధ తిరుగుబాటు ద్వారా విప్లవ విజయాన్ని సాధించాడు లెనిన్. అయితే ఇక ముందు వచ్చే యుద్ధాలు రష్యాలోలాగా ప్రభుత్వానికీ ప్రజలకూ మధ్యన వచ్చే యుద్ధాలుగా కాక ప్రజలలోనే వర్గాలమధ్య వచ్చే యుద్ధాలుగా వుండవచ్చునని కూడా లెనిన్ విశ్లేషించాడు.

బోల్షివిక్ విప్లవం, సోవియట్ రష్యా అవతరణ ప్రపంచ వ్యాపితంగా పీడిత ప్రజలకు గొప్ప ఉత్తేజాన్నీ విశ్వాసాన్నీ యిచ్చినవి. బూర్జువా నియంతృత్వం తొలగిపోయి మొదటిసారిగా ప్రపంచంలో ఒక గడ్డమీద కార్మికవర్గం చేతుల్లోకి అధికారం వచ్చింది. అంటే మొదటిసారిగా అత్యల్ప సంఖ్యాకులు అశేష ప్రజానీకాన్ని పాలించే అన్యాయ వ్యవస్థ అంతరించి ఉత్పత్తి, ఉత్పత్తి సాధనాలు అవి నిజంగా ఎవరివో వారికి చెందాయి. అందుకే ప్రపంచ వ్యాప్తంగా సామ్రాజ్య వాదానికి, వలసవిధానానికి వ్యతిరేకంగా పోరాటంచేస్తున్న ప్రజలందరూ, వారితోపాటు బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా స్వాతంత్ర్య పోరాటం చేస్తున్న భారత ప్రజలు ఈ విప్లవాన్ని ఒక వేగు చుక్కగా ఆహ్వానించారు. భారత స్వాతంత్ర్య పోరాటానికి లెనిన్, బోల్షివిక్ పార్టీకూడ తమ మద్దతు ప్రకటించారు. బోల్షివిక్ విప్లవ విజయాన్ని, లెనిన్ నాయకత్వాన్ని తిలక్, టాగోర్‌లాంటి జాతీయ నాయకులు, రచయితలు కూడ కీర్తించారు. లెనినిజమే భారత స్వాతంత్ర్య పోరాటానికికూడ మార్గదర్శకమని, దేశాల స్వాతంత్ర్య

పోరాటాలు, జాతుల విముక్తి పోరాటాలు, కార్మికవర్గ నాయకత్వంలో కొనసాగినపుడే నిజమైన విజయాన్ని సాధించి ఫలాలను అట్టడుగు ప్రజలకు అందిస్తాయనే అవగాహనలోకి క్రమంగా వచ్చిన విప్లవ వీరుడు భగత్‌సింగ్ నాటికీ నేటికీ భారత ప్రజల హృదయాల్లో ఆరని జ్వాలగా నిత్య యవ్వనంగా జీవిస్తున్నాడు.

భారతీయ సాహిత్యరంగంలో కూడ సామ్యవాద ప్రభావం రష్యన్ విప్లవ విజయంతో ప్రగాఢమైంది. ప్రేంచంద్, నజ్రుల్ ఇస్లాం, రాహుల్ సాంకృత్యాయన్, యశ్‌పాల్, శ్రీ శ్రీ లది ఈ అంతర్జాతీయ వారసత్వమే.

అయితే కార్మికవర్గం అధికారంలోకి రావడమే కార్మికవర్గం ఎల్లకాలమూ ఉత్పత్తిసాధనాల మీద అధికారం కలిగివుండడానికి గ్యారంటీ కాదు. సమాజంలో వర్గాలు ఉన్నంతకాలం సోషలిస్టు వ్యవస్థలో కూడ వర్గపోరాటం కొనసాగుతూనే వుంటుంది. శ్రామికవర్గ నియంతృత్వం అమలుజరపడంలో అలసత్వంవస్తే బూర్జువా వర్గం అధికారాన్ని హస్తగతం చేసుకోవడానికి పొంచివుంటుంది. చుట్టూవున్న పెట్టుబడిదారీ దేశాలు, హిట్లర్ నాజీ దండయాత్ర కూడ కదలించలేకపోయిన సోవియట్ సోషలిస్టు వృక్షాన్ని చెట్టులో పుట్టిన పురుగు తొలిచేసినట్లుగా కృశ్చేవ్ నాయకత్వంతో ఆరంభమైన రివిజనిజం కూల్చేసింది. 1956 లో వర్గపోరాటం స్థానంలో కృశ్చేవ్ ప్రవేశపెట్టిన 'శాంతియుత పరివర్తన' సిద్ధాంతాన్ని ఈ సంవత్సరం రాజ్యాంగం మార్పులో 'కార్మికవర్గ నియంతృత్వం' అనే మాటకూడ తొలగించడంతో బ్రెజ్నేవ్ ఎంతో విధేయంగా పరిపుష్టంచేసి, సామ్రాజ్యవాదుల ప్రయోజనాలకు పట్టుకొమ్మనని నిరూపించుకొన్నాడు.

"మాటల్లో సోషలిజం, చేతల్లో సామ్రాజ్యవాదం" అని లెనిన్ చెప్పిన సోషల్ సామ్రాజ్యవాదం ఈనాడు రష్యాలో అమలు జరుగుతున్నది. ఇది ప్రపంచ పీడిత ప్రజలకు ప్రథమ శత్రువుగా పరిణమించింది. లెనిన్- స్టాలిన్‌ల స్థానంలో కృశ్చేవ్ బ్రెజ్నేవ్‌లు, గోర్కీ- మయకోవస్కీల స్థానంలో పాస్టర్‌నాక్- యవతుశంకోలు వచ్చారు.

బోల్షివిజం వారసత్వాన్ని స్వీకరించడంలో పోరాడే శక్తులు ఎంత తీవ్రమైన ఆచరణాత్మక కృషి చేయాల్సివున్నదో ప్రపంచ పీడత ప్రజలు కొత్తగా ఎదుర్కొంటున్న సోషల్ సామ్రాజ్యవాద ప్రమాదాన్ని బట్టబయలుచేసి పీడిత ప్రజల అండన నిలిచి పోరాడడంలోనూ అంత కృషి చేయాల్సేవున్నది.

— సంపాదకుడు

## బోల్షివిక్ జననం

**మయకోవ్‌స్కీ**

అనువాదం : శ్రీ శ్రీ

విద్యుత్కిరణాలు ఉక్కును తినేసినట్లు
పెట్టుబడిదారీ విధానపు రోజులు నిండాయి
అప్పుడు కాలం కడుపుతో ఉండి
కార్ల్ మార్క్స్‌ని ప్రసవించింది
కార్ల్‌మార్క్స్ లెనిన్ పెద్దన్నయ్య
కార్ల్‌మార్క్స్ రూపం ప్రభవించింది

మార్క్స్ !
గోడమీద అతని రూపచిత్రం ఆకర్షిస్తుంది నిన్ను
అయితే ఆ బొమ్మకీ అసలు జీవితానికీ ఎంత భేదం !
నిశ్చల శిలావిగ్రహంగా కనిపించే ముసిలాయన రూపం
అయితే కార్మికులు తమ చిన్నచిన్న తప్పటడుగులతో
విప్లవ పథాన కదులుతున్నప్పుడు విస్ఫులింగాలు చిమ్మడంలేదా.

మార్క్స్ మనస్సులో హృదయంలో వుండే కొలిమి !
ప్రతీ ఒక్క ఫ్యాక్టరీలో తానే పనిచేసినట్లు
ప్రతీ పనిముట్టుతో తన చేతులే కాయలు కాచినట్లు !
అదనపు విలువల కన్నపుదొంగల్ని
కన్నంలోనే పట్టుకున్నాడు మార్క్స్
అధిక లాభపరుల బొద్దుదాకానైనా
కన్నెత్తి చూడటాని కితరులు భయపడేవేళ
కార్ల్‌మార్క్స్ కార్మికుల్ని వర్గపోరాటంలోకి నడిపించాడు.

వృషభంలా ఎదిగిన పసిడిదూడ పనిపట్టించడానికి
గుడ్డిసిద్ధాంతాల ఊబిలో చిక్కుకుని
ఉక్కిరిబిక్కిరి అవుతున్న కమ్యూనిజంలో
ఎప్పుడో కాలం కలిసివస్తేనే
ఈ నరకంనుంచి విడుదల అని భావించే మనకు
కార్ల్‌మార్క్స్ చూపించాడు గంభీర చారిత్రక నియమావళిని
చక్రం నడిపించండని చేతికిచ్చాడు కార్మికులకు.

లేదు.

మార్క్స్ పుస్తకాలు అచ్చొత్తిన కాగితాలు కావు
అంకెలుకావు లెక్కలుకావు బూజుపట్టిన కవిలెకట్టలుకావు
దారితెలియని కష్టజీవులకు క్రమశిక్షణ నేర్పిన గ్రంథాలవి
విశ్వాసాన్నీ వేగాన్నీ సాధించి
విప్లవ మార్గాన ముందుకు సాగించే గ్రంథాలవి

వాళ్ళనతడు నడిపించాడు వాళ్ళకతడు బోధించాడు
"పోరాటాల్లో రక్తం చిందించండి" అని
"సిద్ధాంతాలకు రుజువు ఆచరణలో కనిపించాలి
ఆచరణకు దారిచూపేవాడు త్వరలోనే వస్తాడు
పుస్తకాలనుంచి యుద్ధరంగాలకు అస్తవ్యస్త జీవుల్ని నడిపిస్తాడు"
వణికే చేతులతో ఆఖరి మాటలాయన వ్రాస్తున్నప్పుడు
ఆయనకళ్ళలో అఖరి ఊహలు మెదిలేటప్పుడు
నాకు తెలుసు
అతని కళ్ళు భవిష్యత్తును చూస్తే అక్కడేం కనిపించిందో
క్రెమ్లిన్ భవనంమీద మాస్కో ఆకాశాలమీద
రెపరెపలాడుతూ ఎగిరే
కమ్యూనిస్టు పతాకం కనిపించిందాతనికి

ఆరమగ్గిన పళ్ళలాగా సంవత్సరాలు పరిపక్వమయాయి
శ్రామికవర్గం ఎట్టకేలకు బాల్యదశ దాటింది
పెట్టుబడిదారీ కోటల పునాదులు కదుల్తున్నాయి
కార్మికతరంగం ఊపునూ బలాన్నీ పుంజుకుంటున్నది.
అతి స్వల్పకాలంలో
చిన్నచిన్న తుఫాను గాలులు ప్రళయ ప్రభంజనాలయినాయి
ఆగ్రహ శిఖరాలమీద తిరుగుబాట్లు పగిలాయి
ఆ మండే యెర్రదనంలో విప్లవాగ్నులు రగిలాయి
బూర్జువా పశువులూరుకుంటాయా కసాయికన్నా కనికారం లేనివి.
థియర్స్ గాలిఫే[1] కలిసి దమనకాండ సాగించలేదా

1. ఫ్రెంచ్ ప్రధానమంత్రి థియర్స్, సైన్యాధిపతి గాలిఫే– 1871 నాటి పారిస్ కమ్యూన్‌మీద యుద్ధ చర్యలు నడిపించినవాళ్ళు.

పారిస్ నుంచి పేర్‌లాషెస్[2] గోడల నుంచి
కమ్యూనార్డుల నీడలు నేటికీ గొంతెత్తి అరుస్తాయి
"చూడండి, వినండి కామ్రేడ్స్ మా పరాజయంనుండి నేర్చుకొండి
ఒంటరిగా పోరాడే వాడికి ఓటమి తప్పదు
మరచిపోకండి మేము నేర్పే ఈ గుణపాఠాన్ని
శత్రువు నెదుర్కోవాలంటే శక్తివంతమయిన పార్టీకావాలి
సమస్త కార్మికవర్గాన్ని ఒక బిగించిన పిడికిలిగా మార్చాలి
కొందరు మేమే నాయకులమని ముందుకొస్తారు
అదును చూసుకొని వెనక్కుమళ్ళి వెన్నుపోటు పొడుస్తారు
మాటల చాటున దాగిన మచ్చల చర్మాన్ని చూడ్డం నేర్చుకొండి
నిజమైన ఒక నాయకుడు
నిరంతరం మనల్ని చెయిపీడని వాడు నిశ్చయంగా వస్తాడు
రైలుపట్టాలలాగా తిన్నగా అన్నంలాగ నిరాడంబరంగా
అన్నివేళలా కష్టానికీ సుఖానికీ మనతోనే నిలిచేవాడు"

ఎన్నో మతాలు ఎన్నోవర్గాలు
ఎన్నెన్నో భాషలు ఏవేవో పరిస్థితులు
బంగారపు చక్రాలమీద ప్రపంచం మూలుగుతూ తిరిగింది
ధనస్వామ్యం తుపాకి మొనల ఏదుపంది
పెరుగుతుంది కొవ్వెక్కిన బలంతో
యూరప్‌ను కమ్యూనిజం అనే భూతం ఆవహించింది
ఒకసారి వెనుకంజవేసి మళ్ళీ విజృంభించింది
భూవలయం అంతటా సంచరించింది
ఈ యీ కారణాలన్నింటివల్లా
ఎక్కడో దూరానవున్న
సింబిర్స్కలో జన్మించాడు
లెనిన్ అనే అందరిలాంటి శిశువు.

---

2. పేర్‌లాషెస్- కమ్యూనార్డులు పూడ్చిపెట్టబడిన పారిస్ శ్మశానం.

# బోల్షివిక్ వారసత్వం

'గర్జించు రష్యా' నుంచి

పుష్కిన్, గోగోల్, షెకోవ్, టాల్‌స్టాయ్
దోస్టోయ్‌వస్కీ, గోర్కీ, కూప్రిన్
శిల్ప సమ్రాట్టులై
జీవితం మథియించి
పాపపంకం నుండి పద్మాలు పుట్టించి
కార్మిక స్వర్గాన్ని కలగన్న రష్యా!
..................................
మార్క్సు, ఎంగెల్సు, బుఖారిన్, బకూనిన్
క్రోపోట్కిన్ భావాల కోలాహలంతో
లెనిన్ తపస్సు,
స్టాలిన్ సేద్యం
జ్వలించిన, ఫలించిన సముజ్జ్వల తేజం!
యునైటెడ్ సోవియట్ సోషలిస్టు రాజ్యం!
స్వాతంత్ర్య శత్రువుల గుండెల్లో బల్లెం!
పరపీడనాపరుల ప్రాణాల భైరవి!
..................................
..................................
ఈ అగ్నివర్షాలు,
ఈ రక్తపాతాలు,
ఏలాగూ వచ్చాయి ఏమయితేకానీ!
ఈ సవనరంగంలో ఎగరనీ జీవాలూ!
ఈ సమరం తుదిచూడక
ఇక నిలిచి పోరాదు!
తిరుగులేని ప్రతిజ్ఞ తీసుకోరష్యా!

శ్రీ శ్రీ
1941

వాళ్ళు
ఫ్యూజిక్[1] దేశానికి
రష్యానుంచి ప్రేమతో వచ్చారు—
తమ యింటికి తాము
ఎంతోకాలం ఎదురుచూచినాక వచ్చినట్లుగా

వాళ్ళు భూమిమీంచి
మృత్యుఛాయల్ని తుడిచేయడానికి వచ్చారు
వాళ్ళకివ్వడానికి ప్రజలదగ్గర ఏ కానుకలూలేవు
కన్నీళ్ళూ కౌగిళ్ళూ ముద్దులూ తప్ప.

తన్నులపూలు కాళ్ళకింద నలిగినవారికోసం
వాళ్ళు వికసించారు
నయన నక్షత్రాలు ఆరిపోయినవాళ్ళకోసం
వాళ్ళు ప్రకాశించారు.

వాళ్ళు 007 నుంచి ప్రేమతో
మళ్ళావచ్చారు
ఫ్యూజిక్ దేశానికి
వాళ్ళ ఆలోచనలూ, అనుభూతులూ
క్రెమ్లిన్ గోడకింద రాజలాంఛనాలతో
పాతేయబడ్డాయి.

ఇపుడు కాలం ఒక రథచక్రంకాదు
ట్యాంక్ గొలుసు
తనకింది మార్గాన్ని నలిచి నమిలేసింది.

---

1. జూలియస్ ఫ్యూజిక్ జెకొస్లవేకియా రచయిత. జెకొస్లవేకియా కమ్యూనిస్టు పార్టీ నాయకుడు కమ్యూనిస్టుపార్టీ రాజకీయ-సాంస్కృతిక దినపత్రికకు ప్రధానసంపాదకుడు. 1942లో ఏప్రిల్ 24న జెక్ రాజధాని ప్రాగ్‌లో గెస్టపో (నాజీహిట్లర్ గూఢచారిశాఖ) యితణ్ణి అరెస్టుచేసి పాంక్రాట్స్‌జైలులో ఒక చిన్న సెల్‌లో ఏడాదిపాటు చిత్రహింసలు పెట్టి జర్మనీకి తరలించి బెర్లిన్‌లోని ఒక నాజీకోర్టులో విచారించి మరణశిక్షవిధించారు. 1943 సెప్టెంబర్ 8వ తేదీ ఉదయం బెర్లిన్ జెయిల్లో ఫ్యూజిక్‌ను ఉరితీసారు. ఇది జరిగిన దాదాపు రెండు సంవత్సరాలకు ఎర్రసైన్యాలు 'ఫ్యూజిక్' దేశానికి రష్యానుంచి ప్రేమతో వచ్చారు జెకోస్లవేకియా విముక్తమయింది.

బెదరిన పక్షుల అరపులు
కాలుతున్న మానవ కాగడాలు
పడిపోతున్న చెట్లు అడిగాయి :
మిమ్మల్నిక్కడికి ఎవరు ఆహ్వానించారు ?
ఏం పనిమీద వచ్చారు మీరు ?

ఒక నవ్వు ప్రతిధ్వనించింది
జెకొస్లవేకియా జనులు మాత్రమే అలా నవ్వగలరు

తర్వాత విషాదంలో
రానున్న ఎన్నో సంవత్సరాలకోసం
నిశ్శబ్దాన్ని పాటించారు.

అమరజీత్ చందన్
1968

---

నాజీనియంత హిట్లర్ సైన్యాలు తూర్పుయూరపును దురాక్రమణచేసి సోవియెట్ రష్యామీదికి దండయాత్ర చేసినపుడు సోవియెట్ సైన్యాలు వీరోచితంగా నాజీసైన్యాలను తిప్పికొట్టి సోవియెట్ రష్యా ప్రజలు నెత్తురు చెల్లించి సాధించుకున్న స్వాతంత్ర్యఫలాలనే కాకుండా తూర్పు యూరపు దేశాల స్వేచ్ఛాస్వాతంత్ర్యాలనుకూడ కాపాడినవి. బెర్లిన్‌దాకా సోవియెట్ ఎర్రసైన్యం తూర్పుయూరప్ ప్రజల హృదయాకాంక్షలే పరచిన ఎర్రతివాచీగా కదలివచ్చింది.

The Soviet Air Force has gone into action- జూన్ 41 అనే వార్త చదివి శ్రీ శ్రీ రాసిన 'గర్జించు రష్యా' (రచనాకాలం 41) కవిత 'నిశ్శబ్ద సంవత్సరాలు'లో అమరజీత్ చందన్ ప్రస్తావించిన 'వాళ్లు భూమిమీంచి మృత్యుఛాయల్ని తుడిచేయడానికి వచ్చారు.' అన్న చరణాలు ఫాసిజంపై సోవియెట్ సైన్యాల విజయాంగానాలే, స్మృతులే.

మళ్ళీ 1968లో కూడ జెకొస్లవేకియాకు రష్యన్ ట్యాంకులు వచ్చాయి. ఈసారి జెకొస్లవేకియా ప్రజల ఆహ్వానంపై కాదు; నాజీలనుంచి విముక్తి కలిగించడానికి కాదు. సోషల్ సామ్రాజ్యవాద విస్తరణకాంక్షలో భాగంగా, దురాక్రమణనీతితో, అమరజీత్ చందన్ కవితలోని 'వాళ్లు 007 నుంచి ప్రేమతో మళ్ళీవచ్చారు' అనే చరణాలలోని ప్రస్తావన ఆ దురాక్రమణగురించే. 007 అనే మాట పెట్టుబడిదారీ విధానము పునరుద్ధరింపబడిన ఈనాటి రష్యా, రష్యన్ సంస్కృతినీ ఉద్దేశించింది.

# సంప్రదాయవాదం - నిహిలిజం - మార్క్సిజం

— త్రిపురనేని మధుసూదనరావు

## భౌతిక వాస్తవం - చైతన్యం

ఏ వాదం శూన్యంలో పుట్టదు. అలాగే మనోసృష్టి కాదు. మరి, కొంతమంది ప్రతిభావంతుల సొంత ఆస్తి కాదు. పైకి కేవలం మానసిక విషయాలుగా కనిపించినా వాదాల్లోని సారాంశం ఎప్పుడూ సామాజికమే. ఎంత అస్పష్టంగా, అతీతంగా కనిపించినా, వాదాలన్నీ భౌతిక జీవితం నుంచి ఏర్పడుతాయి. సమాజ జీవితంలో ప్రాచుర్యంలో వున్న భావాలను తార్కికంగా ఒక మొత్తం చేసి నిర్ధారణ చేయటాన్ని మనం వాదాలంటున్నాం. మెదడులో బాహ్య వాస్తవికత క్రియాశీలంగా ప్రతిబింబించడాన్ని చైతన్యం అంటాం. భౌతిక వాస్తవికత నుంచి ఒకసారి మనస్సులో భావాలు ఏర్పడిన తర్వాత అవి అనేక ఆహేతుక పద్ధతుల్లో సమ్మేళనం పొందుతాయి. కాలగమనంలో చైతన్యానికి వుండే సాంఘిక స్వభావమే వివాదాస్పదం కావడం కూడా జరుగుతుంది. అంటే, చైతన్యం సామాజిక వాస్తవికతకు విడాకులిచ్చి స్వతంత్ర రాజ్యంగా భ్రమలను సృష్టిస్తుంది. వివిధ యుగాల్లోని భావ నిపుణులు భావాలను సమాజ అతీతంగా నిరూపించడానికి భౌతికేతరంగా ప్రచారం చేయడానికి నానా రకాల వాదాలను కల్పిస్తారు. దాంతో భౌతికం, భావం వేరని మానసిక వ్యాపారాలు, శరీర వ్యాపారాలు వేరని, భౌతిక ప్రపంచం, ఆధ్యాత్మిక ప్రపంచం విభిన్నాలని అనేక తప్పుడు సిద్ధాంతాలు ప్రచారంలోకి వచ్చాయి.

తప్పుడు వాదానికైనా, సరి అయిన వాదానికైనా వాస్తవ భౌతిక జీవితమే కారణం.

## వాదాలు - వాటి వర్గ పునాదులు

వాదాలను, భావాలను గూర్చి పరిశీలించేటప్పుడు వాటిని కేవలం 'భావపరిధి'లో కాక వాటి సామాజిక ఆధారాలను ప్రమాణంగా చేసుకోవాలి. మొత్తం సమాజానికి ప్రాతినిధ్యం వహించే విధంగా కనిపించినా వాదాలన్నిటికి వర్గ పునాది వుంటుంది. కాబట్టి భావాల చరిత్రను సమాజ పరిణామ చరిత్రతో అన్వయించి అధ్యయనం చేయటమే శాస్త్రీయ విధానం. అప్పుడే భావాల సామాజిక సార్థకతను మనం అవగాహన చేసుకోగలం. అన్ని భావాలు, వాదాలు వ్యక్తులను ఆశ్రయించే వ్యక్తమైనా ఆ వ్యక్తులు సమాజ అతీత వ్యక్తులు కాదు. ఇతర వ్యక్తులతో కలిసి పనిచేస్తూ కలిసి జీవించే

వృత్తులే. ఈ భావ నిపుణుల్లో చాలామందికి బహిరంగంగా వర్గదృష్టి వుండకపోవచ్చు. సమాజ సాధారణ విషయాలను వివరిస్తున్నట్టే భావించవచ్చు. భావ ప్రతిపాదనలో ప్రచ్ఛన్నతాగుణం, డొంకతిరుగుడు స్వభావం వుండవచ్చు. ఆలోచనా నియమాలను సామాజిక ఉత్పత్తి రంగాన్ని ప్రమాణంగా పరిశీలిస్తే యీ నిపుణుల భావాల్లో వర్గదృష్టిని విశ్లేషించ వచ్చును. కొంతమంది ఉద్దేశపూర్వకంగా బాహాటంగా వర్గ, బౌద్ధిక ప్రతినిధులుగా వుంటారు. మరికొందరు విశ్వవ్యాప్త సామాజిక సృష్టి రహస్యాలను చెబుతున్నట్టు వర్గ ప్రయోజనాలను నిర్వహిస్తారు.

వాదాల వర్గపునాదిని పరిశీలించేటప్పుడు శాస్త్రీయ విధానం అనుసరించకపోతే సత్యాన్వేషణ తప్పు తోవల్లోకి పోయి విఫల శ్రమ మిగులుతుంది. అలాగే వాద తిరస్కార పురస్కారాలు కూడా శాస్త్రీయ ధోరణిలో జరుగకపోతే నిరర్థక గందరగోళం ఏర్పడుతుంది. "సంప్రదాయ వాదం" అంటున్నాం అంటే పాతకాలపు విషయాలని అర్థం కాదు. సామాజిక స్పర్శలేని తర్కవాదమని అర్థంకాదు. సాంప్రదాయ నిరాకరణం సాంప్రదాయవాద నిరాకరణ మాత్రం కాదు. కేవలం వాదస్థాయి నిరాకరణ, శుష్కతాత్విక కాలక్షేపం అవుతుంది. ప్రతివాదం వొక వర్గవాదం. ప్రతివాదం ఒక వర్గ బౌద్ధిక వ్యక్తీకరణం. ప్రతివాదం ఒక సామాజిక శక్తికి ప్రతినిధి. ప్రతివాదం ఒక సాంస్కృతిక రంగంలో ఒక వర్గ ప్రయోజన భాష్యం కాబట్టే వాదాలను గురించి చర్చిస్తున్నామంటే వర్గాలను గురించి చర్చిస్తున్నాం అని అర్థం. వాద వివాదాలు, భావ ఘర్షణలు, సైద్ధాంతిక చర్చలు, సామాజిక రంగంలో వర్గపోరాటంలో భాగంగా గ్రహించవలసి వుంది. అందుకే వివిధ వాద పరిశీలన నిర్దిష్ట చారిత్రక దశ పరిధిలో వర్గపునాదిని దృష్టిలో వుంచుకొని జరగాలి.

## సంప్రదాయం, సంప్రదాయ వాదం

సంప్రదాయ వాదమంటే పురోగామి ప్రగతిశీల స్వభావాన్ని కోల్పోయి, ప్రజా వ్యతిరేక విప్లవ ప్రతీఘాతుక ఆదిమ, బానిస, అర్ధవలస, వలస విధానాలకు సంబంధించిన వాదాలు, సిద్ధాంతాలు, సమాజ జీవితంలో వివిధ ధోరణుల్లో వ్యక్తమవుతున్న పై సామాజిక వ్యవస్థలకు చెందిన భావరూపాలను సంప్రదాయ వాదంగా మార్క్సిస్టులు పరిగణిస్తారు. ఆదినుంచీ అర్ధబానిస భావజాలాన్ని మొత్తంగా నిరాకరిస్తామా? కాదు. బానిస విధానం మీద తిరుగుబాటు చేసిన సమయంలో అర్ధబానిస విధానం అనివార్యంగా కొంత ప్రగతిశీలంగా వుంటుంది. ప్రజలకు కొన్ని కనీస హక్కులు సంక్రమిస్తాయి. అలాగే మొదటిసారిగా సాహిత్యం, కళలు వికసిస్తాయి. ఉన్నత స్థాయి సిద్ధాంత

చర్చలు సాగుతాయి. మానవ విలువలన్నీ పునర్నిర్వచించబడతాయి. చారిత్రకంగా ఆ పోరాటకాలంలో అభ్యుదయాత్మక సమాజ విజయాలు సాధింపబడతాయి. సంప్రదాయవాద నిరాకరణం అంటే వాటిని నిరాకరించడం కాదు. సమాజ పురోగమనానికి దోహదం చేసేవాటిని నిరాకరించడం పిడివాదం లేదా శూన్యవాదం సకల విధ్వంసన వాదం, సమాజం సోషలిస్టు పోరాటాల దశకు చేరుతున్న యుగంలో ఆ పోరాటాలను ప్రతిఘటించడానికి అర్థంలేని వర్గ భౌద్ధిక ప్రతినిధులు ఉపరితలంలో చేసే భావపోరాటాన్ని సంప్రదాయవాదం అంటాం. ఈ వాదం సారాంశం "Go back to the ancients, go back to the old customs." ("తాతతాతల నాటి కథలు త్రవ్వి పోస్తానోయ్". "గత కాలము మేలు వచ్చుకాలము కంటెన్"), ప్రాచీన యుగాలకు తిరోగమించమనటం, వర్తమానాన్ని పూర్వప్రమాణాలతో పరిశీలించటం, ఆధ్యాత్మిక మూఢ వాదం, పూర్వధర్మశాస్త్రాలు, న్యాయవిధానాన్ని పునరుద్ధరించాలని ప్రయత్నంచేయటం రూపంలో వుంటాయి. భావవాదం, మతం పరిభాషలోకూడ సంప్రదాయ వాదం పరివారం అవుతుంది.

శాస్త్రీయమైన సంప్రదాయవాద వ్యతిరేక పోరాటం సంప్రదాయవాదాన్ని ప్రతిఘటించేటప్పుడు, అది మార్క్సిస్టు జ్ఞానసిద్ధాంత ప్రాతిపదికమీద జరగాలి. ముఖ్యంగా భావవాదాన్ని, మతాన్ని పరిశీలించేటప్పుడు అహేతుక, అరాచక పద్ధతుల్ని అనుసరించకూడదు. ప్రపంచ చరిత్రలో మతయుద్ధాల పేరుతో జరిగినా అనేకం వాస్తవానికి వర్గయుద్ధాలే. ఆర్థిక సూత్ర పునాది కలిగినవే. కొన్నిటి వుద్దేశాలరూపంలో మత రూపం కనిపించినా, వస్తువిశ్లేషణలో నాటి ఉత్పత్తి సంబంధాల, వర్గపోరాటాల విషయాన్ని గ్రహించవచ్చు. భౌతిక ప్రపంచ ప్రతిబింబంగా మతం వుంటుంది. ప్రధానంగా సంప్రదాయం మతరూపంలోనే వుంటుంది. అన్ని భావజాలాల్లోనూ సంప్రదాయం ఒక యధాతథశక్తిగా పనిచేస్తుంది. కాబట్టి సంప్రదాయ వ్యతిరేక పోరాటం చేసేటప్పుడు ఆ నిర్దిష్టసమయంలో యథాతథవాదులమీద, దోపిడీ వర్గాలకు దోహదం చేసే సంప్రదాయ సారాంశాలమీద పోరాటం చేయాలి అది మొత్తం మతం మీద పోరాటంగా కాక మతానికి ప్రధానగుణంగావున్న సంప్రదాయంమీద పోరాటంగావుండాలి. ఈ పోరాటానికి రెండు లక్షణాలు అవసరం— ఒకటి శాస్త్రీయ దృక్పథం. సంప్రదాయాన్ని నిందించడం వలనగానీ, అలక్ష్యం చేయటం వలనగానీ. న్యూనపరచడంవలన గానీ అది పోదు శాస్త్రం సాధించిన ప్రకృతి ధర్మాలను, సామాజిక సూత్రాలను ప్రమాణంగా చేసుకొని సంప్రదాయంలోని వివిధ అంశాలను ఎదుర్కోవాలి. ఒక తప్పుడు భావాన్ని శాస్త్రీయ భావంతోనే నాశనం చేయగలం,

రెండోది, అర్ధబానిస విధానంమీద యితర రంగాల్లో ముఖ్యంగా రాజకీయ రంగంలో జరిగే పోరాటం. దీనిలో సంప్రదాయ వ్యతిరేక పోరాటం అవిభాజ్యంగా, సమాంతరంగా వుండాలి. ఈ పోరాటంలోకి అధిక సంఖ్యాక ప్రజల్ని సమీకరించే ఉద్యమస్థాయిలో కృషి జరగాలి. రాజకీయాది ప్రజాపోరాటాలతో లంకె లేకుండా వాటిల్లో భాగంకాకుండా ప్రచారం ఎంత హోరుగా చేసినా అది నిష్ఫల వాచాలత్వంగా మిగిలిపోతుంది ప్రభుత్వ వర్గాలు సాంప్రదాయాన్ని తమకు రక్షకవచంగా వాడుకుంటున్నాయి. తనకున్న ప్రచార సాధనాలను సమృద్ధిగా సంప్రదాయ రక్షణకోసం వినియోగిస్తున్నాయి. కాబట్టే సంప్రదాయ వ్యతిరేక పోరాటాలను, ప్రభుత్వ వర్గాల వ్యతిరేక ప్రజాపోరాటాల్లో అవిభాజ్యంగానే కొనసాగించాలి.

## వెనుకటి సంప్రదాయ వ్యతిరేక పోరాటాలు :

ఈ స్థితి లేకపోవటంవల్లనే సంప్రదాయక వాదంమీద అర్ధశతాబ్దం క్రితమే అరంభమైన తిరుగుబాటు పూర్తి సత్ఫలితాలను యివ్వలేక పోయింది. అయితే ప్రతి స్థితిలోనూ అది బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమం అయినా, అంబేడ్కర్ ఉద్యమం అయినా, రాజారాం మోహనరాయ్‌నుంచీ గురజాడవరకూ జరిగిన సంస్కరణ ఉద్యమం అయినా, సంప్రదాయ వ్యతిరేక పోరాటానికి ఆ చారిత్రకపరిధిలో దోహదం చేశాయి. కనీసం సంప్రదాయ సార్థకతను ప్రశ్నించాయి. బ్రిటిష్ సామ్రాజ్యవాదంమీద జరిగిన పోరాటం సంపన్నవర్గాల ప్రయోజనాల పరిధిలోనే జరిగింది కాబట్టి సంప్రదాయ వ్యతిరేక పోరాటంకూడా నామమాత్రంగానూ, అశాస్త్రీయంగానూ జరిగింది. దేశంలో అనేక ప్రాంతాల్లో రాజాలకు జమీందార్లకు వ్యతిరేకంగా జరిగిన రైతాంగ పోరాటాలకు నాయకత్వం వహించటంలోనూ, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో సంపన్న వర్గాల కుట్రను బహిరంగపరిచి ప్రజా విప్లవాన్ని నిర్మించటంలోనూ కమ్యూనిస్టు ఉద్యమం విఫలంకావటంవల్ల ఆనాటి సంప్రదాయ వ్యతిరేకపోరాటం శాస్త్రీయపద్ధతుల్లో జరుగలేదు. భారతీయ సమాజం ఆధునికం కావటం, అంటే— పెట్టుబడిదారి వ్యవస్థ కావటం తమ బ్రిటన్ సామ్రాజ్యవాదుల నాయకత్వంలోనే ఆరంభమైంది. అది యిప్పటికీ పూర్తి కాలేదు. జనసంఘం, ఆర్.ఎస్.ఎస్. వారి పూర్వులు స్వాతంత్ర్య ఉద్యమంలోనే భారతీయ సంస్కృతి పునరుద్ధరణలాంటి పేరుతోనూ, యింకా అనేక రూపాల్లోనూ సంప్రదాయాన్ని గట్టిగానే బలపరిచారు. ఇప్పుడు బ్రిటిష్‌వాళ్లు పోయినంతమాత్రాన సంప్రదాయం పలాయనం చిత్తగించలేదు. అలాగే తత్వశాస్త్రంలో భావవాదం కూడా. మార్క్సిస్టు భౌతికవాదంలాగా పటిష్టమైన భౌతికవాదం ప్రాచీనకాలంలో వుండే అవకా

శం లేదు. బౌద్ధ దర్శనం, చార్వాక దర్శనాల్లో కొంత పదార్థ ప్రాధాన్యం గుర్తించ బడినప్పటికీ ప్రాచీనకాలంలో తత్వశాస్త్రమంతా భావవాద రూపంలోనే వుంది. భారత దేశంలో భావవాద తత్వశాస్త్రం—మానవజాతి వాదనాశక్తి, సిద్ధాంత నిర్మాణం, తర్క విధానం మొదలైన సిద్ధాంత రూపాన్ని కల్పించగలిగింది. రూపరీత్యా భావవాదం తత్వశాస్త్రానికి దోహదం చేసింది. ఇప్పుడు శతసహస్ర రూపాల్లో భావవాదం పాలక వర్గాల అధికారానికి భాష్యం చెబుతున్నది. సూక్ష్మంగా పరిశీలిస్తే యిప్పటికీ సంప్రదాయం, మూఢ విశ్వాసాలు, మత సూత్రాలకున్న పట్టు భారత దేశంలో భావ వాదానికి రాలేదు. విద్యావిధానంలో, శాస్త్రవిజ్ఞాన ప్రచారంలో భావవాద విషపు పూత మాత్రం బలంగానే వుంది. భావవాదాన్ని కానీ, సంప్రదాయక వాదాన్నిగానీ విప్లవ సిద్ధాంతం వెలుగులో ప్రజాపోరాటాలలో భాగంగానే ప్రతిఘటించడం అవసరం. లేకపోతే తిలక్, గాంధీల పోరాటాలవలె శుష్క ఫలితాలను సాధించగలం. ఈ సమస్యల్ని ఏమీ పరిశీలించకుండా రివిజనిస్టు తాత్వికుడు ఏటుకూరి బలరామమూర్తిగారు "విశాలాంధ్ర" పత్రికలో సంప్రదాయ వాదాన్ని కులవ్యవస్థ పరిధిలో కుదించి వాదస్థాయిలో పోరాటానికి పిలుపునిస్తున్నారు, కులాలు వున్నాయికానీ ఈనాడు కులవ్యవస్థ లేదు. డబ్బుముందు, అధికారంముందు, కులాన్ని లెక్కబెట్టేవాడు ఇప్పుడు ఎవడూ లేడు. మార్గాలను లక్ష్యాలను స్పష్టపరచకుండా ఏదో తాత్వికస్థాయిలో చెప్పినట్టు బలరామ మూర్తిగారు సంప్రదాయవాదాన్ని వాదమాత్ర నిరాకరణతో సంతృప్తిపడ మంటున్నారు.

## రివిజనిస్టుల సూత్రీకరణలు :

మరో విచిత్ర సూత్రీకరణ ఏమంటే, మనకు రాజకీయ స్వాతంత్ర్యం వచ్చిందట! కానీ ఆర్థిక, సాంఘిక స్వాతంత్ర్యం రాలేదట! అంతేకాదు రాజకీయ స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మిగిలినవి సంస్కరణలద్వారా సాధ్యమట!! ఆర్థిక స్వాతంత్ర్యం రాకుండా రాజకీయ స్వాతంత్ర్యం వస్తుందని చెప్పటం ఏ తత్వశాస్త్ర ధోరణి? సోవియట్ సోషల్ సామ్రాజ్యవాదం గురించి తానెలాగూ చెప్పడు, కాని కనీసం అమెరికన్ సామ్రాజ్యవాద ప్రాబల్యాన్నిగూర్చి ఎక్కడా సూచనకూడా చేయలేదు. ఈ తప్పుడు సూత్రీకరణతో సహజంగానే మరికొన్ని తప్పుడు ముగింపులు చేశారు. సాంఘిక శాస్త్రాలబోధన పాతపద్ధతుల్లోనే జరుగుతోందట. ఇక్కడ 'పాత' అంటే అర్థంఏమిటి? ఆధునిక విద్యావిధానంలోనే సామాజిక శాస్త్రాలు బోధించటం ఆరంభమైంది. సామాజిక శాస్త్రాలను నేటి పాలకవర్గాలు ఏమాత్రం అభివృద్ధిచెయ్యవు. ఎందుకంటే సామాజిక శాస్త్ర పరిశోధనలు ప్రజలకు సామాజికాధికార అవగాహనను పెంచుతాయి. పాలకవర్గాల

నగ్న స్వరూపాన్ని బహిర్గతం చేస్తాయి కాబట్టి యిందులో 'పాత' ఏమీలేదు. ఈనాటి సామాజిక శాస్త్ర విద్యాబోధన విజ్ఞానశాస్త్ర ప్రచారం భావవాద భావజాల సమ్మేళనంతో జరుగుతున్నది. ఏటుకూరి యీ విషయాలను అలక్ష్యం చేయడానికి ప్రధాన కారణం, 'ఈనాటి పాలకవర్గాలు ఎవరు?' అనే విషయంలో సందిగ్ధంలో పడటమే— డి.ఎం.కె. సంగతి ఎలావున్నా, బలరామమూర్తిగారు సాంఘిక పార్శ్వంలో ప్రగతినికోరి రాజకీయ, ఆర్థిక పార్శ్వాలను పూర్తిగా అలక్ష్యం చేశారు. దానికి వారి రివిజనిస్టు పరిమితులే కారణం. రివిజనిజం బూర్జువా ఆలోచనా విధానమే. అందుకే వారికి మావో ఆలోచనకంటే నెహ్రూయిజం ప్రగతిశీలంగా కనిపించింది.

## ''నెహ్రూయిజం'' - 'బూర్జువావర్గ కాలానుగుణ పరివర్తన'

నెహ్రూ ఆలోచనలో బూర్జువా మానవతావాది, తాత్వికంగా ఆదర్శవాది. ఐతే నెహ్రూయిజంగానీ, మరోయిజంగానీ, దాని స్వరూపాన్ని నిర్ణయించవలసింది దాని ఆచరణనుబట్టిగానీ గ్రంథాలనుబట్టికాదు. 'నెహ్రూకు మతభావాలు లేవు. ఆయన తాత్వికంగా సంశయవాది. చారిత్రకంగా పురోగమనశీలి. భారత దర్శనం, ప్రపంచ చరిత్రవంటిగ్రంథాలు ఆయన పురోగమనశీలమైన సిద్ధాంతాలు' (విశాలాంధ్ర 26-12-75 ఏటుకూరి) ఒక మార్క్సియన్ భౌతికవాదిగా అనుభవం సంపాదించాననుకుంటున్న బలరామమూర్తిగారు నెహ్రూమీద యిలాంటి అంచనాకు వచ్చారు. ఇంతకీ తాత్వికంగా సంశయవాది, చారిత్రకంగా పురోగమనశీలి ఎలా కాగలడు? పదిహేను సంవత్సరాలకుపైగా భారతదేశ ప్రధానిగా వున్న ఒకవ్యక్తి పురోగమనశీలి అవునా కాదా అని చెప్పడానికి ప్రమాణం ఆయన ఆచరణా లేకపోతే ఆయన పుస్తకాలా? నెహ్రూ పరిపాలనలో ఏ వర్గానికి ప్రాతినిధ్యం వహించాడు? ఏ వర్గ ప్రయోజనాలను ఆయన కాపాడాడు? ఈ వర్గ పరిశీలన లేకుండా 'నెహ్రూయిజం' అని ఒక కొత్త 'యిజాన్ని' కనిపెట్టి బలరామమూర్తిగారు స్వామిభక్తిని చాటుకున్నారు! దేశంలో భూస్వామ్య దళారీ బూర్జువా వర్గాల అధికారాన్ని నెహ్రూ చెక్కుచెదరనివ్వకుండా కాపాడాడు. అమెరికన్ సామ్రాజ్యవాదానికి దేశ ఆర్థిక వ్యవస్థను మారుబేరంలేకుండా విజయవంతంగా తాకట్టు పెట్టాడు. భూస్వామ్య వర్గాల వొత్తిడికి, జాతీయ దురహంకార శక్తులకు లొంగిపోయి జనచైనామీద విద్వేషాన్ని రెచ్చగొట్టాడు. దేశంలో ప్రజా పోరాటాన్ని నిర్దయగా అణచివేశాడు. కాంగ్రెస్‌పార్టీ నెహ్రూ అభ్యుదయ విధానాలను వదిలేసిందట! నెహ్రూ వున్నంతకాలం ఆయనే ఏకైక నాయకుడు. కాంగ్రెసే ఆయన, ఆయనే కాంగ్రెసు, ఈ రెండింటినీ విడదీసి ఏటుకూరి నెహ్రూని తమ నాయకుడుగా చేసుకుం

టున్నారు. ఈ నెహ్రూ'భూతాలింగనం'లో మైమరచి బలరామమూర్తిగారు మార్క్సిజానికి తిలోదకాలిచ్చారు.

## 'నిహిలిజం'- విరసం

"నెహ్రూయిజం" వంటబట్టిన బలరామమూర్తి గారికి 'నక్సలైట్' జీర్ణం కాకపోవడం సహజం. నక్సలైట్లను విమర్శిస్తూనే విరసాన్నికూడా విమర్శించాడు. బూర్జువా ఆలోచనా విధానానికి పట్టాభిషేకంచేసిన మూర్తిగారే నక్సలైట్లది, విరసానిది 'నిహిలిజం' అంటున్నారు. ఈ నిహిలిజాన్ని నిరసనవాదం అంటున్నారు. "మావో యిజం"నిహిలిజం అనే ఎత్తుకు ఎగిరిపోయారు మూర్తిగారు. ఇది రివిజనిస్టు పైత్య వికారం. జనచైనా విప్లవనేత ఆలోచనా విధానం 'నిహిలిజం' అంటున్నారంటే రివిజనిజం ఎంత ప్రమాదకర పాత్ర నిర్వహిస్తున్నదో గ్రహించవచ్చు. నక్సలైటు వుద్యమాన్ని గూర్చికానీ, విరసం రచనలనుగానీ మూర్తిగారు ఏమీ అధ్యయనం చేసే శ్రమ తీసుకోకుండా, వక్రభాష్యాలను యథేచ్ఛగా చేశారు. నక్సలైటు విప్లవోద్యమానికిగానీ విరసం సంస్థకుగానీ స్పష్టంగా మార్క్సిజం-లెనినిజం-మావో ఆలోచనా విధానమే విధానం. ఇక విరసం దిగంబరులతో రాజీపడిందట! దిగంబర సాహిత్య ఉద్యమం ప్రధానంగా నిరసనోద్యమమే. నిహిలిస్టు ఛాయలు కూడా లేకపోలేదు. ఈ విషయాన్ని విరసం రచయితలు అనేక సందర్భాలలో స్పష్టంచేశారు. దిగంబర కవులు కొందరు తమ నిరసనవాదాన్ని త్యజించి విరసం మ్యానిఫెస్టోను అంగీకరించి విరసంలో చేరారు. విరసంలో వాళ్ళు నలుగురు. ఈ నలుగురి రచనల్ని ఎప్పటికప్పుడు విరసం సభ్యులే సమీక్షిస్తూ వచ్చారు. తక్కిన విప్లవ రచయితల్లో ఏ సందర్భంలోనూ నిరసన ఛాయలు గానీ, 'న్యూ లెఫ్టు' భావాలుగానీ లేవు. పైగా గువేరా తత్వాన్ని, సార్త్రే ఆలోచనను, బూర్జువా రాడికల్ అరాచకవాదాలను నిర్ద్వంద్వంగా ఖండించడం జరిగింది. "పాత చరిత్ర, తత్వశాస్త్రం, సంస్కృతులలో ప్రజాతంత్రమైనది ఏమీ లేదు. సర్వమూ విధ్వంసం కావలసినవే. ఇది వారి నిహిలిజం"(విశాలాంధ్ర-ఏటుకూరి)ఎవరు చెప్పారు యిది? బలరామమూర్తిగారి అంతరాత్మబోధ! యిది సర్వమూ విధ్వంసము చేసేది ఎలా ?! ఎందుకు చేయటం ? మనువును ధర్మశాస్త్రం రాయకుండా యిప్పుడెలాచేసేది? వ్యాసుడిని బ్రహ్మసూత్రాలు రాయకుండా యిప్పుడు యెలా నివారించగలరు ? దీనికి మూర్తిగారే "నెహ్రూయిజం"లాటి "ఇజాన్ని" కనిపెట్టియిస్తే మంచిది! ఏటుకూరి ఆరోపించినట్టు విరసం 'సర్వ విధ్వంస వాదాన్ని' ఏనాడూ చేపట్టలేదు. రివిజనిజాన్ని విధ్వంసన చేయాలని మాత్రం సంకల్పించింది. ఆక్రమంలోనే పోరాడుతున్నది.

ఇటీవలి కాలంలో ఫ్యూడల్ సాంప్రదాయాలమీద సైద్ధాంతిక పోరాటం చేయటంలో గణనీయమైన పాత్ర నిర్వహించింది విరసమే. ఆర్.ఎస్.ఎస్. వంటి మతసంస్థలతో, విద్యార్థి పరిషత్ వంటి అభ్యుదయ వ్యతిరేక విద్యార్థి సంస్థలతో పోరాటం చేసింది ఎవరు? విరసం జయప్రకాశ్ నారాయణ్ ఉద్యమాన్నికానీ, ఇందిరా అధికారదాహాన్ని కానీ రివిజనిస్టుల కుహనాఫాసిస్టు వ్యతిరేక సభలనుకానీ సమర్థించలేదు, సమర్థించబోదు.

## కాలానుగుణ పరివర్తనం - మార్క్సిజానికి అన్వయించిన రివిజనిజం

విరసంమీద, నక్సలైట్లమీద తన "న్యూ లెఫ్ట్" నిహిలిస్టు పాండిత్యాన్ని ప్రదర్శించి బూర్జువాలను గురించి మూర్తిగారు యిలా అన్నారు "నెహ్రూయిజం కాలానుగుణ పరివర్తనను గుర్తించే బూర్జువా వర్గానికి ప్రతినిధి", నెహ్రూయిజాన్ని మూర్తిగారి కల్పనకు వదిలిపెట్టి "బూర్జువా వర్గం కాలానుగుణ పరివర్తనను అంగీకరిస్తుందా" యిది ఇందిరాయిజమా? మార్క్సిజమా? బూర్జువా వర్గం తన అధికారాన్ని ఎన్నటికీ వదులుకోదు. 'కార్మికశక్తి విప్లవం ద్వారా బలవంతంగా బూర్జువా వర్గం నుంచి రాజకీయాధికారం కైవసం చేసుకోవలసిందే' అనే మార్క్సిజం సంగతి ఏమిటి? అసలు కాలం ఏమిటి? బ్రహ్మంగారి కాలజ్ఞాన తత్వం కాదుగదా, సమాజ పురోగమనాన్ని కాలానుగుణ పరివర్తనకు వదలదలచుకున్న మూర్తిగారు ఇక సాంప్రదాయాన్ని వ్యతిరేకించడం ఎందుకు? అదిమాత్రం కాలానుగుణ పరివర్తన యెందుకు చెందదు? ఇది వీరి మార్క్సిజం ముసుగులోని బూర్జువా తత్వం. అదే మరి రివిజనిజం. ఈ వ్యాసంలో బలరామమూర్తిగారు రివిజనిస్టుపార్టీ ప్రస్తుత కార్యక్రమాన్ని తత్వశాస్త్ర పరిభాషలో వివరించడానికి పూనుకున్నారు. ఈనాటి పాలకవర్గాలు పాలిత వర్గాలను గురించి వర్గపోరాటాన్ని గురించి ఒక్కమాటకూడా ముచ్చటించలేదు. వారికాఅవసరం కూడాలేదు. వీరి ఈ 'కాలానుగుణ పరివర్తనా'సిద్ధాంతంతో, విధివిహిత విచారంతో భారతీయ తత్వశాస్త్రాన్ని శాస్త్రీయంగా పరిశోధిస్తారట. ఇంతకుపూర్వమే ఆ ప్రమాదకరమైన పని అత్యంత విచారమూలకంగా చేసి ప్రదర్శించాడుకూడా.

విప్లవరచయితలు యిలాంటి రివిజనిస్టు వక్రభాష్యాలను నిరంతరం శాస్త్రీయంగా ఎదుర్కోవాలి. ఎందుకంటే యిటు సంప్రదాయం అటు రివిజనిజం రెండూ విప్లవ ప్రతీఘాతుక శక్తులే.

# వి. ఐ. లెనిన్ - ఏరిన రచనలు

తెలుగు అనువాదం: ప్రగతి ప్రచురణాలయం, మాస్కో

1973లో వెలువడిన ఈ పుస్తకం లెనినిజం తాలూకు "పాకెట్ బుక్"గా ఉద్దేశించబడింది. ఈ పుస్తకాన్ని గురించి ఇందులోని పీఠిక ఇలా చెబుతున్నది.

"లెనినిజం అంతర్జాతీయ బోధ. అది కార్మికవర్గం యొక్క, సకల దేశాల ప్రజల విమోచనోద్యమం యొక్క అనుభవాన్ని ప్రతిబింబిస్తుంది. అది యే దేశానికైనా, దాని అభివృద్ధి ఏ స్థాయిలో ఉన్నాసరే అన్వయించే మౌలిక సూత్రాలుగల బోధ. అది సకల దేశ ప్రజలకూ సంతోషమయ భవిష్యత్తును నిర్మించుకునే మార్గాల గురించీ, సాధనాల గురించీ విస్పష్టమైన చిత్రం యిచ్చి శాంతి, అభ్యుదయాల శక్తులు జయిస్తాయనే విశ్వాసం వాళ్ళకు కలిగిస్తుంది. యీ సపుటంలో ప్రచురించబడిన రచనల అధ్యయనం సమస్త మానవజాతికీ అభివృద్ధి మార్గాన్ని వెలిగించే లెనినిస్టు మౌలిక సూత్రాలను గ్రహించడానికీ, కైవసం చేసుకోడానికీ వీలు కలిగిస్తుంది."

"ఆయన రచనలు విప్లవ మార్క్సిస్టు సిద్ధాంత అభివృద్ధిలోని నూతన లెనినిస్టు దశ అవుతాయి... లెనిన్ మార్క్సిస్టు సిద్ధాంతంలోని కీలక సూత్రాలను అభివృద్ధిచేసి కార్మికవర్గంయొక్క, సమస్త యితర శ్రామిక ప్రజలయొక్క విమోచన పోరాటానికి ఈ సిద్ధాంతం ఎంత ముఖ్యమైందీ నిరూపించే రచనలు ఈ సంపుటంలో ఉన్నాయి... లెనినిజం అనేది పెట్టుబడిదారీ వ్యవస్థనుండి సోషలిజంకు పరివర్తన జరిగే యుగం యొక్క మార్క్సిజం."

ఇందులో మొదటి వ్యాసం "కారల్ మార్క్స్ సిద్ధాంతం యొక్క చారిత్రక భవితవ్యం." (1913 మార్చి 1)

1848లో మార్క్స్, ఏంగెల్స్‌లు "కమ్యూనిస్టు ప్రణాళిక" ప్రచురించిన అనంతరం నడిచిన ప్రపంచ చరిత్రను లెనిన్ మూడు దశలుగా విభజించాడు. 1858లో ఫ్రాన్స్, ఇటలీ, జర్మనీ వగైరాలలో జరిగిన బూర్జువా ప్రజాతంత్ర విప్లవాల నుండి 1871 పారిస్ కమ్యూన్ వరకూ మొదటి దశ; పారిస్ కమ్యూన్ నుండి 1905 రష్యా విప్లవం వరకూ రెండో దశ; మూడవదశ అటు పిమ్మటిది.

మొదటి దశలో మార్క్సిజం ఇతర సోషలిస్టు సిద్ధాంతాలలాగే ఉండింది. దాని ప్రభావం ఏమీలేదు. రెండోదశ ఆరంభంలో, 1848 జూన్‌లో పారిస్ ప్రభుత్వం కార్మికులమీద కాల్పులు చెయ్యటం ద్వారా "కార్మికవర్గం ఒక్కటే స్వభావతః సోష

లిస్టు అని వెల్లడి" అయింది. "వర్గేతర రాజకీయాలకూ, వర్గేతర సోషలిజంకూ సంబంధించిన సిద్ధాంతాలన్నీ వట్టి చెత్త అని రుజువైంది." "రిపబ్లిక్... కేవలం కార్మికవర్గ వీరత్వం మూలంగా దృఢపడింది."

రెండోదశలో "మార్క్సిజం సంపూర్ణ విజయం పొందింది, విస్తరించసాగింది... సోషలిస్టు పార్టీలు... ప్రతిచోటా ఏర్పడి బూర్జువా పార్లమెంటరిజంను ఉపయోగించుకోవడమూ, తమ సొంత దినపత్రికలనూ, తమ విద్యాసంస్థలనూ, తమ ట్రేడ్ యూనియన్‌లనూ, తమ సహకార సంఘాలనూ స్థాపించడమూ నేర్చుకున్నాయి."

మార్క్సిజం విజయం పొందిందనటానికి నిదర్శనం: అది "దాని శత్రువులను మార్క్సిస్టుల వేషం వేసుకునేటట్టు నిర్బంధించింది. లోపల కుళ్లి పోయిన 'ఉదార వాదం' సోషలిస్టు అవకాశవాదంరూపంలో పునరుజ్జీవం పొందడానికిప్రయత్నించింది. గొప్ప యుద్ధాలకు బలాలను సిద్ధంచేసుకునే దశను వాళ్లు ఈ యుద్ధాల విసర్జనగా వ్యాఖ్యానించారు... 'సామాజిక శాంతి', వర్గపోరాట విసర్జన వగైరాలను బోధించినారు."

ఇంతలో "ఆసియాలో గొప్ప ప్రపంచ కల్లోలాల కొత్త మూలం ప్రారంభమైంది. రష్యన్ విప్లవంవెంట టర్కీ, పర్షియా, చైనాలలో విప్లవాలు వచ్చినాయి. ప్రపంచంలోని ఏ శక్తీ ఆసియాలో పాత ఫ్యూడల్ దాస్యాన్ని పునరుద్ధరించడంగానీ, ఆసియా, అర్ధఆసియాజనాల వీరోచిత ప్రజాస్వామ్యాన్ని తుడిచివెయ్యడంగానీ సాధ్యం కాదు... యూరప్, ఆసియాల అనుభవం తర్వాత, వర్గేతర రాజకీయాల గురించీ, వర్గేతర సోషలిజం గురించి మాట్లాడేవాణ్ణి బోనులో పెట్టి, ఆస్ట్రేలియన్ కంగారూ పక్కనో, అలాంటిదాని పక్కనో ప్రదర్శించాలి."

అలాంటివాళ్లను చరిత్ర మాత్రమే గాడిదలను చేస్తూ వస్తున్నది గానీ, భేషైన లెనిన్ సూచనను మనుషులు అమలు చెయ్యటం లేదు.

"రాబోయే చారిత్రక దశలు కార్మికవర్గ సిద్ధాంతంగా మార్క్సిజంకు యింకా గొప్ప విజయం రాబోతున్నది"అని లెనిన్ చెప్పిన జోస్యం ఎలా రుజువయిందీ మనకు పుష్కలంగా తెలుసు.

రెండవ వ్యాసం "మార్క్సిజంయొక్క మూడు మూలాలూ, మూడు భాగాలూ" —కారల్‌మార్క్స్ 30 వ వర్ధంతి సందర్భంగా రాసిన వ్యాసం (1913 మార్చి).

మార్క్సిజం మూడు మూలాలూ ఏమంటే, జర్మన్ తత్వశాస్త్రమూ, ఇంగ్లీషు అర్థశాస్త్రమూ, ఫ్రెంచి సోషలిజమూనూ. వీటిమీదనే మార్క్సిజం ఆవిర్భవించి పురోగమించింది.

మార్క్సిస్టు తత్వశాస్త్రం భౌతికవాదం, 18వ శతాబ్దఅంతంలో "భౌతికవాదం ఒక్కటే స్థిరమైనదీ. ప్రకృతిశాస్త్ర బోధలకన్నిటికీ విధేయమైనదీ, మూఢవిశ్వాసాలకు పడికట్టు మాటలకూ, వగైరాలకు వ్యతిరేకమైనదీ అయిన తత్వశాస్త్రంగా రుజువయింది... మార్క్సు, ఎంగెల్సు తాత్విక భౌతికవాదాన్ని సమర్థించి, యీ ప్రాతిపదిక నుండి వైదొలగిన ప్రతిదీ యెంత తప్పు అయిందీ పదే పదే వివరించినారు... మార్క్సు తత్వశాస్త్రాన్ని మరింత ఉన్నతస్థాయికి అభివృద్ధి చేసినాడు... ముఖ్యంగా హెగెల్ తాత్విక వ్యవస్థ విజయాలతో సుసంపన్నం చేసినాడు... ఆ విజయాలలో ప్రధానమైనది పరస్పరవాదం (డయలెక్టిక్స్).

మార్క్సుచేసిన గొప్ప పని ఏమంటే ప్రకృతిజ్ఞానంలో సమాజజ్ఞానం అంతర్భాగంచేశాడు. "ఆయన చారిత్రక భౌతికవాదం శాస్త్రీయ అంచనాలు గొప్ప విజయం... ఉత్పాదకశక్తుల పెరుగుదల ఫలితంగా, ఒక సమాజ జీవిత వ్యవస్థనుండి అంతకంటె ఉన్నతమైన వ్యవస్థ యెలా అభివృద్ధిఅయేదీ... యీ సిద్ధాంతం చూపింది. మానవుని జ్ఞానం, అతనిమీద ఆధారపడకుండా ఉన్న ప్రకృతిని ఎలా ప్రతిబింబిస్తుందో, అలాగే మానవుని సామాజిక జ్ఞానం సమాజంయొక్క ఆర్థిక వ్యవస్థను ప్రతిబింబిస్తుంది. రాజకీయ సంస్థలు ఆర్థిక పునాదిమీదవున్న ఉపరినిర్మాణం".

మార్క్సు విశిష్టరచన "కాపిటల్" పెట్టుబడిదారీ సమాజపు ఆర్థికవ్యవస్థను అధ్యయనం చేసింది. అంతకు పూర్వం ఇంగ్లండులో ఆడమ్‌స్మిత్, డేవిడ్ రికార్డోలు వస్తువుల విలువ వాటిని తయారుచేయటానికి వినియోగించే శ్రమపై ఆధారపడుతుందనే సిద్ధాంతానికి ("విలువయొక్క శ్రమ సిద్ధాంతానికి") పునాదులు వేశారు. మార్క్సు ఈ సిద్ధాంతాన్ని ముందుకు తీసుకుపోయాడు.

"బూర్జువా ఆర్థికవేత్తలు వస్తువుల మధ్య (మారక) సంబంధాన్ని చూసినచోట మార్క్సు మనుషులమధ్య సంబంధాన్ని వెల్లడించినాడు. సరుకుల మారకం విడి విడి ఉత్పత్తిదార్ల మధ్య సంబంధాన్ని మార్కెట్‌ద్వారా వ్యక్తం చేస్తుంది. విడివిడి ఉత్పత్తిదార్ల ఆర్థిక జీవితమంతటినీ విడదీయరాకుండా ఏకంచేస్తున్నదని డబ్బు సంకేతిస్తుంది. పెట్టుబడి యీ సంబంధంయొక్క యితోధిక అభివృద్ధిని సంకేతిస్తుంది. మనిషి శ్రమశక్తి సరుకు అవుతుంది. కూలి కార్మికుడు తన శ్రమశక్తిని యజమానికి (భూమీ, ఫ్యాక్టరీలూ, శ్రమపరికరాలూ గలవాడికి) అమ్ముతాడు. కార్మికుడు తననూ, తనకుటుంబాన్నీ భరించడానికి అయ్యే ఖర్చుకుగాను దినంలో కొంత భాగాన్ని వినియోగిస్తాడు; తక్కిన భాగాన్ని అతను ప్రతిఫలంలేకుండా పనిచేస్తాడు. (అంటే అతనికూలికి సమ

మైన ఉత్పత్తి కొన్ని గంటలుమాత్రమే పనిచేసి, మిగిలిన శ్రమను యజమానికి నైవేద్యంపెడతాడు)" ఈవిధంగా కార్మికుడు పెట్టుబడిదారునకు అదనపు విలువను, పెట్టుబడిదారీవర్గ సంపదయొక్క మూలాన్ని సృష్టిస్తాడు.

"అదనపు విలువ సిద్ధాంతం మార్క్సు ఆర్థిక సిద్ధాంతానికి పునాదిరాయి."

ఈవిధంగా కార్మికుడు తన శ్రమద్వారా సృష్టించిన పెట్టుబడి అతన్నే నలిపేస్తుంది. "చిన్న యజమానులను నాశనంచేస్తుంది, నిరుద్యోగుల సమూహాన్ని సృష్టిస్తుంది... వ్యవసాయంలోకూడా యీస్థితి గమనించవచ్చు."

సన్నకారు ఉత్పత్తిని ధ్వంసంచేసి. పెట్టుబడి శ్రమయొక్క ఉత్పాదక శక్తిని పెంచుతుంది. గుత్తవ్యాపారం ఏర్పడుతుంది. ఉత్పత్తి అంతకంతకూ సామాజికం అవుతుంది. "లక్షల, దశలక్షల కార్మికులు క్రమబద్ధమైన ఆర్థిక వ్యవస్థలో అనుబంధింపబడతారు. కానీ ఈ సమష్టి శ్రమయొక్క ఉత్పత్తిని కొద్దిమంది పెట్టుబడిదార్లు సొంతపరచుకుంటారు. ఉత్పత్తిలో అరాజకత్వమూ, సంక్షోభాలూ, మార్కెట్ల కొరకు తీవ్రమైన వేటా, ప్రజానీకంలో అత్యధిక భాగం యొక్క జీవిత భద్రతారాహిత్యమూ తీవ్రతరమౌతాయి."

పెట్టుబడిమీద ఆధారపడే కార్మికులు తమ సమైక్య శ్రామిక మహాశక్తిని సృష్టించుకుంటారు. ఇందుకు పెట్టుబడే కారణభూతమవుతుంది.

ఫ్యూడలిజమును పడగొట్టి "స్వేచ్ఛా" పెట్టుబడిదారీ సమాజం అవతరించింది. ప్రజాపీడనకూ, దోపిడీకి ఇదొక కొత్తరూపం అన్నది స్పష్టం కాగానే రకరకాల సోషలిస్టు సిద్ధాంతాలు బయలుదేరాయి. "తొలికాలపు సోషలిజం ఊహాస్వర్గపు సోషలిజం అది పెట్టుబడిదారీ సమాజాన్ని విమర్శించింది, అభిశంసించింది. శపించింది, దానివి నాశనం గురించి కలలు గన్నది. దోపిడీ అవినీతి అని ధనికులను ఒప్పించడానికి ప్రయత్నించింది." అదోరకమైన గాంధీ తత్వం కాబోలు.

కాని నిజమైన పరిష్కారాన్ని చూపటంగానీ, కూలి బానిసత్వంయొక్క వాస్తవాన్ని నిరూపించటంగాని, పెట్టుబడిదారీ అభివృద్ధి మార్గాలు వ్యక్తం చెయ్యటంగాని, నూతన సమాజాన్ని సృష్టించే సామర్థ్యం ఏ సామాజికశక్తికి ఉన్నదీ చూపించటంగానీ జరగలేదు. వర్గ పోరాటాలు సమస్త అభివృద్ధికీ మూలమని క్రమంగా స్పష్టమైనది. యూరప్ అంతటా, ముఖ్యంగా ఫ్రాన్స్‌లో, ఫ్యూడలిజం పతనం వెంట జరిగిన విప్లవాల ద్వారా.

"ఫ్యూడల్ వర్గంమీద 'రాజకీయ స్వేచ్ఛ' యొక్క ఏ ఒక్క విజయమూ భీషణ ప్రతిఘటన లేకుండా సాధించబడలేదు. పెట్టుబడిదారీ సమాజంలోని వివిధ వర్గాల మధ్య చావు బ్రతుకుల పోరాటం లేకుండా ఏ ఒక్క పెట్టుబడిదారీ దేశాలు అంతో ఇంతో స్వేచ్ఛాయుతమైన, ప్రజాస్వామిక ప్రాతిపదికమీద అభివృద్ధి కాలేదు."

ప్రపంచ చరిత్రనుంచి గుణపాఠం లాగి, దాన్ని మినహాయింపులు లేకుండా వర్తింపజేసిన మొదటి మేధావి మార్క్స్, ఆ గుణపాఠమే వర్గపోరాట సిద్ధాంతం.

"రాజకీయాలలో మనుషులు వంచనకూ, ఆత్మవంచనకూ తెలివితక్కువగా గురి అయినారు. నైతిక, మత, రాజకీయ, సాంఘిక నుడికారాల, ప్రకటనల, వాగ్దానాల వెనుక యేదో ఒక వర్గంయొక్క ప్రయోజనాలను వెదకడం వాళ్లు నేర్చుకున్న దాకా యెల్లప్పుడూ అలా గురి అవుతుంటారు. సంస్కరణల కొరకూ, మెరుగుదల కొరకు పోరాడేవాళ్లు యెల్లప్పుడూ మోసగించబడతారు ప్రతిపాతసంస్థా యెంత కిరాతకంగా కుళ్ళి పోయినదిగా కనిపించినా, కొన్ని పాలక వర్గాల శక్తులచేత అది నడిపింపబడుతూ ఉందని వాళ్లు గుర్తించేదాకా... ఆ వర్గాల ప్రతిఘటనను బ్రద్దలుచేసే మార్గం... పాతను మాడ్చిపారవేసి, కొత్తను సృష్టించేశక్తి కాగల... బలాలను మన చుట్టూ వున్న సమాజంలోనే గుర్తించి వాటిని ప్రబుద్ధంచేసి, పోరాటానికి సంఘటితం చేయడం ... బానిసత్వంనుండి బయటపడే మార్గాన్ని మార్క్స్ తాత్విక భౌతికవాదం మాత్రమే చూపించింది... కార్మికవర్గం తన వర్గ పోరాటం ద్వారా విద్యా విజ్ఞానాలు పొందుతున్నది. బూర్జువా సమాజపు దురభిప్రాయాలను తొలగించుకుంటున్నది. తన శ్రేణులను మరింత చక్కగా సమీకరిస్తూ, తన విజయాల ఫలితాన్ని కొలవడం నేర్చుకుంటున్నది, దుర్నిరోధంగా పెరుగుతున్నది.

"మార్క్సిజమూ, రివిజనిజమూ" అన్న వ్యాసంలో లెనిన్ ఇలా చెప్పాడు.

మార్క్స్ సిద్ధాంతం అడుగడుగునా పోరాటం సలుపుతూ ముందుకు పోవలసి వచ్చింది. బూర్జువా శాస్త్ర విజ్ఞానం మార్క్సిజమును పూర్వపక్షంచేసి, ఓడించేసినట్టు ప్రకటించింది. "నిర్మూలించబడిన" ప్రతిసారీ మార్క్సిజం మరింత బలం పుంజుకున్నది. 1840 నుంచి ఒక అర్ధ శతాబ్దం ఈ సిద్ధాంత సంఘర్షణలలోనే గడిచింది. 60లలో ఈ ఘర్షణ సిద్ధాంత పరిధినుంచి ప్రత్యక్ష కార్మికోద్యమరంగానికి సన్నిహితమయింది. కార్మికోద్యమాలలో ఇతర సిద్ధాంతాలను తోసిరాజని, మార్క్సిజం పూర్తి విజయం సంపాదించటం 90లలో పూర్తి అయింది. కార్మికోద్యమ అంతర్జాతీయ

సంస్థ పునరుద్ధరించబడినప్పటినుంచీ ముఖ్యవిషయాలన్నిటిలోనూ మార్క్సిస్టు దృక్పథం అవలంబించింది.

అంతటితో మార్క్సిస్టు వ్యతిరేక ధోరణులు ఇతర మార్గాలు అవలంబించాయి. కానీ మార్క్సిజంలోనే దాని వ్యతిరేక ధోరణులు తలయెత్తి పోరాటం కొనసాగింది. ఇదే రివిజనిజం. ఈ రివిజనిజం సారం ఏమిటి?

రివిజనిజం తాత్వికరంగంలో, బూర్జువా ప్రొఫెసర్ల అడుగుజాడలలో తిరోగమించి, "మత గురువులు వెయ్యిసార్లు వర్ణించిన పడికట్టు పదాలను ప్రొఫెసర్లు పునశ్చరణ" చేస్తే భౌతికవాదం పూర్వపక్షం చేయబడిందని గొణిగింది. "పరస్పరవాదం" స్థానంలో "సరళపరిణామ" వాదాన్ని తెచ్చిపెట్టింది.

ఇక ఆర్థిక విషయాలలో రివిజనిజం మార్క్సిజంలో "సవరణలనూ", "కొత్త వాస్తవాలనూ" ప్రవేశపెట్టింది. ఏమిటవి? వ్యవసాయరంగంలో సాంద్రీకరణా భారీ ఉత్పత్తికి స్వస్తి జరుగవు; పెట్టుబడిదారీకింద ఆర్థిక సంక్షోభాలు ఇకముందు అరుదుగానూ, దుర్బలంగానూ ఉంటాయి- కార్టెల్లూ, ట్రస్టులూ వాటిని తొలగించను కూడా వచ్చు; వర్గవైరుధ్యాల తీవ్రత తగ్గిపోతుంది; పెట్టుబడిదారీ పతనమవుతుందన్న సిద్ధాంతం తప్పు; మార్క్స్ ప్రతిపాదించిన "విలువ" సిద్ధాంతాన్ని సరిదిద్దటం సబబే!

అంతర్జాతీయ సోషలిజంలో ఈ విషయాలను గురించి రివిజనిస్టులతో పోరాటం సాగింది. ఈ రివిజనిస్టు భావాలన్నీ తప్పుఅని వాస్తవాలతోనూ, సంఖ్యలతోనూ రుజువు చేయబడింది. ఒక్క పార్శ్వానికి సంబంధించిన (పాక్షిక) వాస్తవాలమీద ఆధారపడిన పై పై సాధారణీకరణల ద్వారా రివిజనిస్టులు, శాస్త్రీయ అర్థంలో, పాపం చేసినారు. రాజకీయంగా వాళ్ల చేసిన పాపం యేమిటంటే రైతును విప్లవ కార్మికుని దృక్పథం అవలంబించమని ప్రేరేపించేబదులు ఆస్తిపరుని దృక్పథం అవలంబించమని ఆహ్వానించినారు. లేదా ప్రేరేపించినారు."

ఆర్థికసంక్షోభాలను గురించీ "పీడన సిద్ధాంతం" గురించీ రివిజనిస్టులు మరింత పెద్దగోతిలో పడ్డట్టు త్వరలోనే రుజువయింది. సంక్షోభాలు రానేవచ్చాయి. గుత్త సంస్థలు ఒకరకం ఉత్పత్తి ఏకీకరణసాధిస్తూ, మరొకపక్క ఉత్పత్తిలో అరాజకాన్ని పెంచి, కార్మికుల భద్రతను దెబ్బతీసి, పెట్టుబడి పీడనను తీవ్రంచేసి, వర్గవైరుధ్యాలను ఎప్పటికన్నా ఎక్కువ చేశాయి.

రాజకీయరంగంలో రివిజనిజం మార్క్సిజం పునాదిని సవరణ చెయ్యటానికి గట్టి ప్రయత్నం చేసింది. రాజకీయస్వేచ్ఛా, ప్రజాస్వామ్యమూ, సార్వజనీన వోటుహక్కూ

వర్గపోరాట కారణాన్ని తొలగిస్తాయనీ, కార్మికులకు స్వదేశమంటూ లేదన్న సూత్రాన్ని, (కమ్యూనిస్టు ప్రణాళికలోది) అబద్ధం చేస్తాయనీ, ప్రజాస్వామ్యంలో అధికసంఖ్యాకుల నిర్ణయం అమలు జరుగుతుంది గనక రాజ్యం వర్గపరిపాలనగా ఉండదనీ, ప్రగతిశీల సంఘసంస్కరణవాద బూర్జువాలతో పొత్తు (సి.పి ఐ. కి కాంగ్రెసుతో పొత్తులాంటిది) నిరాకరించకూడదనీ రివిజనిస్టులు వాదించారు. ఇవన్నీ "ఉదారవాద" బూర్జువా అభిప్రాయాలను పోలినవే. "అలాంటి అభిప్రాయాలు ఎంత అసంబద్ధమైనవీ, పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్థంలో మొత్తం యూరప్ చరిత్ర ఇరవయ్యవ శతాబ్ది తొలిభాగములు మొత్తం రష్యన్ విప్లవ చరిత్ర స్పష్టంగా తెలుపుతాయి. 'ప్రజాతంత్ర' పెట్టుబడిదారీ యొక్క స్వేచ్ఛలో ఆర్థిక విభేదాలు తగ్గిపోలేదు సరికదా, యింకా తీవ్రమైనాయి."

బూర్జువా రిపబ్లిక్కులు వర్గపీడన అంగాలన్నది పార్లమెంటరీజం మరింతగా బట్టబయలు చేస్తుందనీ, సంక్షోభాలకూ, విప్లవాలకూ, అంతర్యుద్ధాలకూ దారితీస్తుందని లెనిన్ చెప్పాడు. బూర్జువా ప్రజాస్వామ్యాల తత్వం అర్థంచేసుకోలేనివాడు "ఇలాంటి వాదాల (సామూహిక హింసతో తేల్చుకునే వాదాల)లో విజయోపేతంగా పాల్గొనడానికి కార్మికవర్గ జనాలను సిద్ధంచేసే సూత్రబద్ధమైన ప్రచార, ఆందోళనలను ఈ పార్లమెంటరిజంమీద యెన్నడూ కొనసాగించజాలడు... పోరాట సామర్థ్యం అతితక్కువగా ఉన్నవాళ్ల, అత్యంత ఊగిసలాడేవాళ్ల ద్రోహులూ అయిన వీళ్ళతో యోధులను లంకించడం ద్వారా ఈ ఒప్పందాలు జనాల చైతన్యాన్ని కేవలం మొద్దుబరుస్తాయి. జనాల పోరాటంయొక్క వాస్తవ ప్రాముఖ్యాన్ని బలహీనపరుస్తాయి" అన్నాడాయన.

రివిజనిజంయొక్క ఆర్థిక, రాజకీయ ధోరణిని "ఉద్యమమే సర్వమూ, అంతిమలక్ష్యం ఏదీకాదు," (బెర్న్‌స్టయిన్) అన్నమాట బాగా వ్యక్తంచేస్తుంది. ప్రతి కొత్త సమస్యా, ముందు ఊహించని ప్రతి కొత్త పరిస్థితీ ఏదో ఒక రివిజనిజమును ఎప్పుడూ, అనివార్యంగా ఉత్పత్తి చేస్తుందని లెనిన్ చెప్పాడు. "రివిజనిజం అంతర్జాతీయ ఘటన" అన్నాడు,

"దక్షిణ పక్ష" రివిజనిజం గురించి చెబుతూ పెట్టుబడిదారీ సమాజంలో విధిగా ఉంటుందనీ, "పెట్టుబడిదారీ అభివృద్ధి స్థాయిలలో వున్న భేదాలకంటె" అది "గంభీరమైనదీ'' అనీ లెనిన్ అన్నాడు.

"చిన్న ఉత్పత్తి నుండి పెట్టుబడిదారీ వ్యవస్థ ఉద్భవించింది, నిత్యం ఉద్భవిస్తున్నది. పెట్టుబడిదారీ వ్యవస్థ మళ్లీమళ్లీ అనివార్యంగా కొన్ని 'కొన్ని మధ్యపొర

లను' ఉత్పన్నం చేస్తుంది. యీ సన్నకారు ఉత్పత్తిదార్లు మళ్లీ అంటే అనివార్యంగా కార్మికవర్గ శ్రేణులలోకి తోయబడినారు. విశాలమైన కార్మికపార్టీలలో పెటీ బూర్జువా దృక్పథం మళ్లీమళ్లీ తలఎత్తడం సహజం.

"కార్మికవర్గ విప్లవంలో అదృష్టాలు మారిందాకా" ఇలాగే ఉంటుందనీ, విప్లవం సాధించడానికి ప్రజానీకంలో మెజారిటీని "సంపూర్ణ కార్మిక వర్గీకరణ" చేయడం అత్యవసరమనుకోవడం గొప్ప పొరపాటని లెనిన్ హెచ్చరించాడు. ఈ వ్యాసం 1908 నాటిది.

1899 అక్టోబరు తరవాత ఎప్పుడో లెనిన్ చేసిన ప్రసంగం "మా కార్యక్రమం." ఇందులో లెనిన్ కొన్ని ముఖ్యవిషయాలు చెప్పాడు. అందులో ఒకటి, మార్క్సిజమును పిడివాదంగా భావించేవారికి హెచ్చరిక.

"మార్క్స్ సిద్ధాంతం పూర్తి చేయబడిందనీ, అనుల్లంఘ్యమైనదనీ మేము నమ్మడంలేదు; అది శాస్త్రానికి పునాది మాత్రమే వేసిందనీ, సోషలిస్టులు జీవితంతో సమంగా నడవదలచుకుంటే యీ శాస్త్రాన్ని అన్నిదిశలలోనూ అభివృద్ధిచేయాలనీ మాకు దృఢమైన విశ్వాసం వుంది. యీ సిద్ధాంతం సాధారణ మార్గదర్శక సూత్రాలను మాత్రం సమకూర్చుతున్నది. యీ సూత్రాలు ఇంగ్లండులోకంటె భిన్నంగా ఫ్రాన్సులోనూ, ఫ్రాన్సుకంటె భిన్నంగా జర్మనీలోనూ, జర్మనీలోకంటె భిన్నంగా రష్యాలోనూ ప్రయుక్తమవుతాయి."

కార్మికుల ఆర్థిక, రాజకీయ పోరాటాల సంబంధాన్ని లెనిన్ ఇలా వివరించాడు :

"ఆర్థిక పోరాటంకోసం రాజకీయ పోరాటాన్ని విస్మరించడం అంటే అంతర్జాతీయ సోషల్ డెమోక్రసీ యొక్క మౌలిక సూత్రం నుండి వైదొలగడమన్నమాట, కార్మికోద్యమం యొక్క యావత్తు చరిత్రా మనకు నేర్పేదానిని విస్మరించడమన్నమాట. ఆర్థికపోరాటం యేదీ కార్మికులకు యే స్థిరమైన మెరుగుదలనూ తీసుకురాలేదు. ఆర్థిక పోరాటాన్ని విస్తృత ప్రమాణంలో నడిపించడం కూడా సాధ్యం కాదు. ప్రతి ఆర్థిక పోరాటమూ ఆవశ్యకంగా రాజకీయ పోరాటం అవుతుంది; (ఇలా కారాదని మన పాలకులు !) సోషల్ డెమోక్రసీ దీనినీ దానినీ అవిచ్ఛేదంగా కలిపి, కార్మికవర్గం యొక్క ఏకైక పోరాటంగా చేయాలి. అలాంటి పోరాటం యొక్క ప్రథమ, ప్రధాన లక్ష్యం రాజకీయ హక్కులను గెలుచుకోవడంగా, రాజకీయ స్వేచ్ఛను గెలుచుకోవడంగా వుండాలి." (మన కార్మిక నాయకులు ఇందుకు సిద్ధంగా ఉన్నారా ? అలా చేస్తే కాంగ్రెసుతో కొంతమందికి స్నేహభంగం కాదా ?)

"ఏంచెయ్యాలి? మన ఉద్యమం యొక్క జరూరు సమస్యలు" అనే పుస్తకాన్ని ప్రచురించేముందు లెనిన్, 1901 మే నెలలో "ఇస్క్రా"లో, "యెలా ప్రారంభించాలి?" అన్న వ్యాసం ప్రచురించాడు. ఇది ఆచరణ విధానానికీ, పనికీ సంబంధించిన ప్రశ్న అనీ, ఇది (అప్పటికి) ఇంకా పరిష్కారం కాలేదనీ, "ఆర్థికవాదధోరణి" చావలేదనీ, రాజకీయ సంస్థా నిర్మాణానికీ, ఆందోళనకూ సంబంధించినవని గుంటపూలు పూస్తున్నదనీ, సూత్రరహితమైన "మిశ్రమవాదం" తలఎత్తుతున్నదనీ ఆయన అన్నాడు.

సంస్థా నిర్మాణం గురించి మాట్లాడుతూ ఆయన "యెంత 'నిర్జీవ, శాంతియుత' పరిస్థితిలోనైనా, 'విప్లవతత్వ క్షీణత' యెంతగా ఉన్నా, సమరశీల సంస్థను నిర్మించడమూ, రాజకీయ ఆందోళన సాగించడమూ అత్యవసరం. సరిగా అలాంటి దశలలోనే అలాంటి పరిస్థితులలోనే ఇలాంటిపని ప్రత్యేకంగా అవసరం; ఎందుకంటే ప్రేలుళ్ళు, ప్రజ్వలనలూ జరిగేసమయాలలో సంస్థను నిర్మించడం కాలాతీతంగా ఉంటుంది; ఎప్పుడు అనుకుంటే అప్పుడు కార్యకలాపాలు ప్రారంభించడానికి పార్టీ సంసిద్ధంగా ఉండాలి... సకల పరిస్థితులలోనూ, సకల సమయాలలోనూ రాజకీయ పోరాటం చేసే నేర్పుగల బలమైన సంస్థ లేకుండా, స్థిరమైన సూత్రాలచేత ప్రదీప్తం చేయబడి, పట్టుదలగా నిర్వహించబడే క్రమపద్ధతిగల ఆచరణ పథకం సమస్యే లేదు" అన్నాడు.

1901లో రష్యన్‌పార్టీ తక్షణ కర్తవ్యం "సకల శక్తులనూ సమీకరించగలిగి పేరుకు మాత్రమేగాక వాస్తవ ఆచరణలో ఉద్యమాన్ని నడిపించగల విప్లవ సంస్థను ప్రతిప్రజ్వలనానికీ అండదండలు యిచ్చి, నిర్ణయాత్మక పోరాటానికి అనువైన పోరాట శక్తులను నిర్మించడానికీ, దృఢపరచడానికీ దానిని ఉపయోగించడానికి సిద్ధంగా ఉండే సంస్థను, నిర్మించడానికి పిలుపు ఇవ్వడం" ఈ లక్ష్యాలను లక్ష్యం చెయ్యకపోతే పార్టీ రివిజనిస్టు అవుతుంది.

"మనకు అన్నిటికంటె యెక్కువగా అవసరమైంది వార్తాపత్రిక.... చివరివిషయం, మనకు నిశ్చయంగా కావలసింది ఒక రాజకీయ వార్తా పత్రిక" అన్నాడు లెనిన్. మనదేశంలాంటి సాంస్కృతిక అరణ్యంలో రాజకీయ భావాలు పండించటానికి సాంస్కృతిక వ్యవసాయం కూడా ఎంతో జరగాలి. రాజకీయ భావాలకు మన దేశం ఊసర క్షేత్రంగా ఉన్నది. అందుకే ఈ దేశ ప్రజలు— అత్యధిక సంఖ్యాకులు— ప్రజాస్వామ్యం ముసుగుకింద వచ్చి ఫాసిజం అమలు జరగనిస్తున్నారు.

1901 సెప్టెంబరులో "ఇస్క్రా" పత్రిక ధోరణిని విమర్శిస్తూ "ఒక కామ్రేడ్ల బృందం" ఒక లేఖ రాసింది. ఈ లేఖతోపాటు, దానికి లెనిన్ సమాధానం "ఆర్థికవాద

సమర్థకులతో సంభాషణ" అనే శీర్షికతో ఇందులో ప్రచురించబడింది. అందులో లెనిన్ ప్రకటించిన కొన్ని అభిప్రాయాలు:

"సిద్ధాంతకారుడు సద్యోజనిత ఉద్యమంకంటె ముందువుండి, దారిచూపించి, భౌతిక అంశాలు (పరిస్థితులు) యెదుర్కొనే సిద్ధాంత, రాజకీయ సమస్యలకూ, యెత్తుగడలకూ, సంస్థా నిర్మాణానికీ సంబంధించిన సమస్యలనూ అందరికంటె ముందు పరిష్కరించగలిగినప్పుడే ఆ పేరుకు అర్హుడు... ఉద్యమంయొక్క భౌతిక అంశాలను విమర్శనాత్మకంగా చూడాలి. సద్యోజనితత్వం (స్పాంటేనిటీ)లోని ప్రమాదాలనూ, లోపాలనూ చూపించగలిగి, దానిని చైతన్యస్థాయికి యెత్తగలిగి ఉండాలి... సోషల్ డెమోక్రట్లు ఉద్యమానికి ముందు నడవగూడదనీ, దాని తోకవెనుక కాళ్ళీడ్చుకుంటూ నడవాలనీ బోధించే వ్యక్తులూ, పత్రికలు ముందుకు వచ్చినారు... సోషల్ డెమోక్రట్లు సకల ప్రజాతంత్ర ఉద్యమ నాయకత్వాన్ని తమ సొంత చేతుల్లోకి తీసుకుంటే తప్ప వాళ్ల నిరంకుశత్వాన్ని యెన్నడూ కూలదోయజాలరని గ్రహించలేకపోవడం–ఈ ధోరణికి వ్యతిరేకంగా మేము రాజీలేని పోరాటం సాగించినాము. సాగిస్తూనే ఉంటాము....'ఇస్క్రా' ప్రజానీకంలోని అన్ని పొరలలోనూ రాజకీయ అసంతృప్తిని రేపుతున్నందుకు మేము గర్విస్తున్నాము, దీనిని మరింత విస్తృత స్థాయిలో చేయజాలనందుకు మాత్రమే మేము విచారిస్తున్నాము"

"ప్రజాతంత్ర విప్లవంలో సోషల్ డెమోక్రసీ యొక్క రెండు ఎత్తుగడలు" అన్న లెనిన్ రచన, బోల్షెవిక్కులకూ, మెన్షెవిక్కులకూ గల సిద్ధాంత, ఆచరణ విభేదాలను స్పష్టం చెయ్యటానికి అంకితమయింది. 1905 మేలో రష్యన్ సోషల్ డెమోక్రటిక్ లేబర్‌పార్టీ మూడవ సభ లండన్‌లో జరిగింది. అందులో బోల్షెవిక్కులు పాల్గొన్నారు. అదే సమయంలో మెన్షెవిక్కులు జెనీవాలో కాన్ఫరెన్సు జరిపారు. రెండు సమావేశాల తీర్మానాలనూ తీసుకుని లెనిన్ "కార్మికవర్గ కర్తవ్యాల దృక్పథం నుండి మన బూర్జువా విప్లవాన్ని మొత్తంగాచూసే బోల్షెవిక్ అంచనకూ, మెన్షెవిక్ అంచనకూ మధ్యగల మౌలిక అభావాన్ని "నిర్ధరించటానికి ఈ రచన చేశాడు. లెనిన్ ప్రముఖ రచనలన్నిటిలాగే ఇందులోకూడా, తాత్కాలిక సమస్యలను విశ్లేషించే సత్యాలతోపాటు వివిధ దేశాలకూ, కాలాలకూ, పరిస్థితులకూ అన్వయించే పరమ సత్యాలు పుష్కలంగా మనకు లభిస్తాయి అందుచేత ఇది కేవలం చారిత్రక వ్యాసం కాదు, ఒక శాస్త్ర గ్రంథం కూడా.

"బూర్జువా ప్రజాస్వామ్య దిశలో అవసరమైన మార్పులు మరింత నిదానంగా, మరింత క్రమక్రమంగా, మరింత జాగరూకతతో, తక్కువ కృతనిశ్చయంతో, విప్లవం

ద్వారా కాక సంస్కరణల ద్వారా జరగటం బూర్జువా వర్గానికి యెక్కువ అనుకూలం. యీ మార్పులు సామాన్య ప్రజల స్వతంత్ర విప్లవ కార్యకలాపాలనూ, చొరవనూ, శక్తినీ వీలైనంత తక్కువగా అభివృద్ధిచేయడం బూర్జువావర్గానికి అనుకూలం. తద్వ్యతిరేకంగా, బూర్జువా భూస్వామ్య దిశలో అవసరమైన మార్పులు సంస్కరణల రూపంలో కాక, విప్లవరూపంలో జరగడం కార్మిక వర్గానికి ఎక్కువ అనుకూలం."

"బూర్జువావర్గం యెల్లప్పుడూ అస్థిరంగా ఉంటుంది. కార్మికవర్గం మాత్రమే ప్రజాస్వామ్యం కొరకు స్థిరమైన పోరాటంచేసే యోధుడుగా ఉండగలదు. దాని విప్లవ పోరాటంలో రైతు జనాలు కలిసినప్పుడు మాత్రమే అది ప్రజాస్వామ్యంకొరకు విజయవంతమైన పోరాటంచేసే యోధుడు కాగలదు. కార్మికవర్గం యీ పోరాటానికి తగినంత బలంగా లేకపోతే, బూర్జువావర్గం ప్రజాతంత్ర విప్లవ అగ్రభాగాననుండి, దానికి అస్థిర, స్వార్థపూరిత స్వభావం యిస్తుంది. కార్మికవర్గం యొక్క, రైతాంగం యొక్క విప్లవ ప్రజాతంత్ర నియంతృత్వంతప్ప యేదీ దీనిని వారించజాలదు."

"మాటలు ఆచరణ కూడా అవుతాయి, అనే విషయాన్ని వెకిలి విప్లవవాదం గమనించదు; యీ ప్రతిపాదనను దరహంమీద చరిత్రకు వర్తింపజేసినప్పుడు నిర్వివాదంగా ఉంటుంది. యే తిరుగుబాటులూ యిలాంటి ఆచరణకు సమానం కావు. విప్లవదశ ప్రవేశించినప్పుడు, పాత 'ఉపరినిర్మాణం' పై నుండి కిందిదాకా బీటలువారినప్పుడు, తమకోసం కొత్త ఉపరినిర్మాణం సృష్టించుకొనే వర్గాల యొక్క, జనాల యొక్క బహిరంగ రాజకీయ ఆచరణ వాస్తవమైనప్పుడు, అంతర్యుద్ధం ప్రారంభమైనప్పుడు, ఆచరణకు మారవలసిన అవసరం గురించి సూటి నినాదం యివ్వకుండా పాత పద్ధతిలో 'మాటలకు' పరిమితం కావడమూ, ఆచరణనుంచి తప్పుకోడానికి ప్రయత్నించడమూ అనేది నిరాసక్తతా, నిర్జీవత్వమూ, ఛాందసమూ, లేకపోతే విప్లవానికి ద్రోహమూ అవుతాయని తోకవాదపు విప్లవకారులు గ్రహించలేరు."

"మీచుట్టూ చూడండి, వీధుల్లో జవాబుకోసం వెదకండి– ప్రతిచోటా శాంతియుత నిరాయుధ ప్రజాసమూహాలను కాల్చివేయడంద్వారా ప్రభుత్వమే అంతర్యుద్ధం ప్రారంభించలేదా? విప్లవ పక్షపాతులు యిప్పుడు తిరుగుబాటు సమస్యను యెలా ప్రదర్శించాలి అనే విషయం గురించి కన్నులున్న వాళ్ళకు యేమీ సందేహం ఉండదు."

"బూర్జువావర్గం తన సంకుచిత, స్వార్థప్రయోజనాలు తీరిన వెంటనే అనివార్యంగా ప్రతీఘాత విప్లవం వైపు, నిరంకుశత్వం వైపు, విప్లవానికి వ్యతిరేకంగా, ప్రజలకు వ్యతిరేకంగా మళ్లుతుంది. కార్మికవర్గం మాత్రమే చివరిదాకా నడుస్తుందని నమ్మగలం."

"పెట్టుబడిదారీ, ఉత్పత్తి సంబంధాలమీద ఆధారపడిన రాజకీయ స్వేచ్ఛ అంతా, దరహంమీద, బూర్జువా స్వేచ్ఛ. స్వేచ్ఛ కొరకు డిమాండు ప్రాథమికంగా బూర్జువావర్గ ప్రయోజనాలను వ్యక్తంచేస్తుంది. దాని ప్రతినిధులు యీ డిమాండును మొట్టమొదట లేవనెత్తినవాళ్లు దాని మద్దతుదార్లు తాము సంపాదించిన స్వేచ్ఛను ప్రతిచోటా యజమానులలాగే ఉపయోగించి, దానిని మితమైన కచ్చితమైన బూర్జువా మోతాదులకు కుదించి, విప్లవ కార్మికవర్గాన్ని శాంతి కాలంలో నిగూఢ పద్ధతులలో అణచి వేయడంతోనూ, కల్లోల కాలంలో కిరాతకంగా అణచివేయడంతోనూ జోడించినారు."

ఈ కొద్ది వాక్యాలలో మనదేశం తాలూకు యాభై చిల్లర ఏళ్ళ రాజకీయ చరిత్ర ఇమిడి ఉన్నది.

"విప్లవాలు చరిత్ర యొక్క వాహనాలు, అని మార్క్స్ అన్నాడు. విప్లవాలు తాడిత, పీడితుల ఉత్సవాలు విప్లవ సమయంలోలాగ మరెప్పుడూ ప్రజాసముదాయం నూతన సమాజ సృష్టికర్తలుగా అంత చురుకుగా ముందుకువచ్చే స్థితిలో ఉండదు... అలాంటి సమయాలలో ప్రజలు అద్భుతాలు నిర్వహించగలరు. కానీ, అలాంటి సమయంలో విప్లవ పార్టీల నాయకులుకూడా తమ లక్ష్యాలను మరింత సమగ్రంగా, మరింత ధైర్యంగా ముందుకు తీసుకుపోవాలి— తమ నినాదాలు యెల్లప్పుడూ జనాల విప్లవ చొరవకంటెముందు వుండేటట్లుగా, దివిటీలాగ ఉపకరించేటట్లుగా...."

"ట్రేడ్‌యూనియన్ ఉద్యమాన్ని ఉపేక్షించకుండా, అత్యంత స్వల్పమైన చట్టబద్ధమైన అవకాశాలనైనా (సైతం) వినియోగించుకోడానికి నిరాకరించకుండా విప్లవ కాలంలో... తిరుగుబాటుయొక్క, విప్లవసైన్య, విప్లవ ప్రభుత్వ నిర్మాణం యొక్క కర్తవ్యాలను ముందుకు తేవాలి.

"విప్లవాన్ని గుర్తించడానికి విప్లవకారుడు కానవసరంలేదు... సంబంధాలు వాస్తవాలు రూపుదాలుస్తుండగా... ఉదార బూర్జువాలు విప్లవాన్ని గుర్తించవలసిన అవసరాన్ని తెలుసుకోవడం ప్రారంభించినారు. వాళ్లు అలా చేసేది విప్లవకారులైనందువల్ల కాదు... విధిలేక, తమ ఇష్టానికి వ్యతిరేకంగా, విప్లవవిజయాన్ని కోపంతో చూస్తూ... వాళ్ల పోరాటాన్నీ, విప్లవాన్నీ ద్వేషిస్తారు."

"మాటల దుర్వినియోగం రాజకీయాలలో మామూలు విషయం. ఉదాహరణకు 'సోషలిస్టు' అనే పేరును ఇంగ్లీషు బూర్జువా ఉదారవాదపు మద్దతుదార్లూ, బిస్మార్క్ మద్దతుదార్లూ, పోపు 13వ లియో మిత్రులూ తరుచుగా సొంతపరుచుకున్నారు. 'విప్లవం' అనే పదం కూడా దుర్వినియోగానికి పూర్తిగా లోబడుతుంది. ఉద్యమాభివృద్ధిలోని ఒకానొక దశలో అలాంటి దుర్వినియోగం అనివార్యం."

"మార్క్సిస్టు దృక్పథం నుండి విప్లవం అంటే యేమిటి? కాలం తీరిన రాజకీయ ఉపరి నిర్మాణాన్ని... బలవంతంగా ధ్వంసం చేయడం. అభివృద్ధియొక్క ఒకానొక దశలో, పాత ఉపరి నిర్మాణపు నిరుపయోగత్వం అందరికీ తేటతెల్లమవుతుంది. విప్లవం అందరిచేతా గుర్తింపబడుతుంది."

"వెకిలి బూర్జువా దృక్పథంనుండి నియంతృత్వమనేదీ, ప్రజాస్వామ్య మనేదీ ఒకటి వున్నచోట మరొకటి ఉండజాలని పదాలు."

"కొన్ని సమస్యలు బలంద్వారా మాత్రమే పరిష్కారమౌతాయి. మొదట దౌర్జన్యానికీ, అంతర్యుద్ధానికీ మామూలుగా దిగేది ప్రగతి వ్యతిరేకవర్గాలే; 'కార్యక్రమంలో తుపాకి సన్నీని చేర్చ'డానికి మొదటివాళ్ల వాళ్లు... నిజంగా విప్లవకరవర్గం ప్రతిపాదించవలసింది సరిగ్గా నియంతృత్వ నినాదమే... ప్రతీఘాత విప్లవం నుండి రక్షణా, ప్రజల సర్వసత్తాకతకు విరుద్ధమైన ప్రతిదానినీ వాస్తవంగా తొలగించడమూ... విప్లవ ప్రజాతంత్ర నియంతృత్వం తప్ప మరేమీకాదు.

"పరమమైన స్వేచ్ఛను గురించి చెప్పే మాటలు పచ్చి వంచన... శ్రామిక ప్రజాసముదాయాలు దారిద్ర్యంలోనూ, కొంతమంది ధనికులు పర రక్తోపజీవులుగానూ జీవించే సమాజంలో నిజమైన స్వేచ్ఛ వుండజాలదు... ఎవరైనా సమాజంలోజీవిస్తూ సమాజం నుండి స్వేచ్ఛగా ఉండజాలరు. బూర్జువా రచయిత, లేక కళాకారుడు, లేక అభినేత్రియొక్క స్వేచ్ఛ కేవలం ముసుగులో డబ్బుసంచిమీదా, లంచంమీదా, సాని వృత్తిమీదా ఆధారపడడం. సోషలిస్టులమైన మేము యీ వంచనను బట్టబయలు చేస్తాము.

"సోషలిస్టు విప్లవ మార్గంలో రాజకీయ విప్లవాలు అనివార్యంగా ఉంటాయి; సోషలిస్టు విప్లవాన్ని ఒకే ఒక ఘటనగా కాక, సంక్షుభిత ఆర్థిక రాజకీయ కల్లోలాల యుగంగా, అత్యంత తీవ్రమైన వర్గపోరాటమూ, అంతర్యుద్ధమూ, విప్లవాలూ, ప్రతీఘాత విప్లవాలూ నిండిన యుగంగా గ్రహించవలసి వుంటుంది."

ఈ పుస్తకంలో చిట్టచివరిది "సోషలిస్టు విప్లవమూ, జాతుల స్వయం నిర్ణయ హక్కూ" అనే రచన యొక్క "సారాంశం".

ఈ పుస్తకం కూడ మాస్కో 'ప్రగతి' ప్రచురణాలయంవారు ప్రచురించినదే. 'సామ్రాజ్యవాదమూ, సామ్రాజ్యవాదులూ' అనువదించినవారే దీనిని కూడా అనువదించినట్టు కనబడుతుంది అయితే ఇవి ఒక సంవత్సరం ముందుగా (1973లో) అచ్చయింది. ఇందులో కూడా "కంటిన్ సీతను" అన్నట్టుగా వాక్యభాగాలు ముందువెనకగా ఉన్నా, 1974 అనువాదంతో పోల్చితే చాలా సరళంగా ఉన్నది. మాస్కో నుంచి వెలువడే సిద్ధాంత గ్రంథాల అనువాదాలు పోనుపోను బాగుపడటానికి బదులు క్లిష్టం కావటం శోచనీయం.

కొడవటిగంటి కుటుంబరావు

జ్ఞాపకాలు :

# 'భూమి శాసనం'

బోల్షివిక్ విప్లవశక్తులు వింటర్ ప్యాలెస్‌ను స్వాధీనం చేసుకోగానే లెనిన్ నిండుగా గాలిపీల్చాడు. అందాకా చర్యతీసుకోవటంలో మా మిలిటరీ నాయకుల నత్తనడక ఆయనకు చాలా ఆందోళనకరంగావుందె. ఆయనతనచిరువేషాన్ని తీసివేశాడు. తన చిరకాల రాజకీయ స్నేహితులతో కలిసి విప్లవ సంఘటనల సమాహార సమావేశానికి ఎదురుచూస్తున్న పెట్రోగ్రాడ్ సోవియట్ ఆఫ్ వర్కర్స్ అండ్ సోల్జర్స్ డిప్యూటీస్ (సోవియట్ కార్మికుల సైనికుల) సమావేశానికొచ్చాడు.

లెనిన్ వేదిక ఎక్కినప్పుడు మోగిన చప్పట్లను పిడుగులతో పోల్చినా చాలదు. అది అంతకన్నా ఎంతో ఎక్కువ. అది ఆ విశాలమైన హాలునంతా చుట్టేసిన ఒక మహత్తరమైన మానవభావాల తుఫాను. సమావేశం ప్రారంభమయింది మళ్ళీ అభినందనల అరుపులు, నినాదాలు, సంతోషాతిరేకం... అట్లా గణనీయమైన, చారిత్రకమైన సమావేశం కొనసాగింది. చివరిదాకా ఎంతో ఉత్సాహంగా తుఫానులాగే.

చివరకు ఆ సాయంత్రం కార్యక్రమం ముగియడంతో ఆ రాత్రి గడపడానికి మేము నేనుండేచోటుకు వెళ్ళాం. దొరికింది తిన్నాం. ఆ రాత్రి లెనిన్ మంచి విశ్రాంతి తీసుకోవాలి అన్నది నా కోరిక; ఆయన సంతోషాతిరేకంతో ఉన్నా బాగా అలసిపోయాడన్నది స్పష్టమే. ఆయనను ప్రత్యేకంగావున్న నా గదిలో పడుకోమని ఎంతో కష్టం మీద ఒప్పించగలిగాను. అక్కడ ఒక బల్ల, కాగితం, సిరా, పుస్తకాలు ఆయనకు అందుబాటులోవుంటాయి.

ప్రక్కనేవున్న గదిలో నేనొక సోఫామీద పడుకున్నాను లెనిన్ నిద్రపోయాడని నమ్మకం కుదిరేదాకా నేను మేల్కొని ఉండాలనుకున్నాను. ఎక్కువ భద్రతకోసం అన్ని తలుపులూ, గొళ్ళాలు వేసి తాళాలు పెట్టాను. వీధి ద్వారాలు మూసేసాను. ఎవరైనా తలుపులు పగులగొట్టుకొని వచ్చి లెనిన్‌ను అరెస్టు చేస్తారో, చంపేస్తారో అనే భయంతో రివాల్వర్ లోడ్ చేసుకొని సిద్ధంగా పెట్టుకొన్నాను. ఎందుకంటే అధికారంలో ఇది మొదటిరాత్రి. ఏం జరిగినా జరగవచ్చు.

అనుకోని పరిస్థితి ఏర్పడితే ఎవరెవరికి తెలపాలో ఓ ప్రత్యేకమైన జాబితా తయారుచేసుకున్నాను. పార్టీ, కార్మిక సంఘాలకు సంబంధించిన నాకు తెలిసిన కామ్రేడ్లందరి టెలిఫోన్ నెంబర్లు రాసిపెట్టుకున్నాను.

లెనిన్ అప్పటికి తన గదిలో లైటు తీసేశారు. నేను శ్రద్ధగా చెవులు రిక్కించి విన్నాను. ఏ అలికిడీ లేదు. నేను మెల్లగా నిద్రమత్తులోకి జారుకున్నాను. మరు క్షణంలో నిద్రలో మునిగిపోయేవాడ్ని. అకస్మాత్తుగా ఆయన గదిలో లైటు వెలిగింది. చప్పుడే లేకుండా ఆయన బెడ్‌మీంచి దిగడం విన్నాను. నిశ్శబ్దంగా తలుపు తెరచి నేను 'నిద్రపోయా'నని తృప్తిపడ్డాడు. బొటనవ్రేళ్ళమీద బల్లదగ్గరికి నడిచాడు. ఎవ రికీ నిద్రాభంగం కాకూడదని ఆయన ఉద్దేశ్యం. బల్లదగ్గర కూర్చున్నాడు. సిరా బుడ్డి తెరిచాడు. కాగితాలు పరిచాడు. పనిలో మునిగిపోయాడు.

అతడు రాశాడు. చదివాడు. నోట్స్ తీసుకున్నాడు మళ్ళీ రాసాడు. చివరకు పూర్తి అయినట్లున్నది మొత్తంగా సవరణలతోపాటు చిత్తుప్రతినుంచి సిద్ధప్రతి మెత్తి రాస్తున్నట్టున్నాడు. తెలతెల్లవారుతున్నది. పెట్రోగ్రాడ్ శరత్కాలపు ఆలస్యపు వేకువ ఆకాశంలో మేల్కొంటున్నది. ఆకాశం బూడిదరంగుకు మారుతున్నది. అప్పుడు లెనిన్ లైటార్పేసి బెడ్‌మీదికి వెళ్ళాడు.

మరునాడు ఉదయం అందరికీ నిద్రమేల్కొనే సమయం అయినప్పుడు ఎవరినికూడా ఎలాంటి శబ్దం చేయొద్దనీ లెనిన్ చాలా రాత్రిదాకా మేల్కొనివున్నాడు బాగ అలసిపోయా డని హెచ్చరించాను అకస్మాత్తుగా తలుపు తెరుచుకొన్నది. దుస్తులు వేసుకొని తయారై శక్తివంతంగా, తాజాగా, పరిపూర్ణ తేజంతో జీవం తొణికిసలాడుతూ సహజ మైన హాస్యధోరణిలో మేమెవ్వరమూ ఊహించని విధంగా లెనిన్ తన గదిలోంచి బయటికి వచ్చాడు.

"సోషలిస్టు విప్లవ తొలిరోజున మీకు అభినందనలు" మా అందరినీ ఆయన అభినందించాడు; ఆయన ముఖంమీద అలసిపోయిన ఛాయలు లేవు, 20 గంటలు పని చేసి 2, 3 గంటలకన్నా మించి నిద్రపోనప్పటికీ ఆ రాత్రంతా మంచి విశ్రాంతి తీసు కున్నట్టుగా వున్నాడు. మేము బ్రేక్‌ఫాస్ట్ (ఉపాహారము) తీసుకోడానికి కూర్చున్న ప్పుడు, రాత్రి తానుకూడా మాయింట్లోనే గడిపిన క్రుపస్కాయ (లెనిన్ భార్య) తన గది నుంచి బయటకు వచ్చింది. అప్పుడు వ్లాదిమిర్ ఇల్యీచ్ లెనిన్ తన జేబులోంచి ఆయన సుప్రసిద్ధమైన 'డిక్రీ అన్ లాండ్' (భూమి శాసనము) బయటకు తీసాడు.

"ఇప్పుడు దీన్ని ప్రకటించాలి. ప్రచురించాలి. మంచిగా పంచేలా చూడాలి. అప్పుడు వాళ్ళు దాన్ని వెనక్కితీసుకొనే ప్రయత్నం చేయనీ! అసాధ్యం— భూమిమీద ఏ శక్తీ రైతులనుండి ఈ శాసనాన్ని వెనక్కితీసుకోజాలదు. భూమిని తిరిగి తొలి యజ మానులకు ఇవ్వజాలదు. మన విప్లవం సాధించిన అత్యంత ప్రముఖమైన ప్రయోజ

నాల్లో యిది ఒకటి. ఈరోజునుంచే వ్యవసాయ విప్లవం కొనసాగించబడుతున్నది. సంఘటితం చేయబడుతున్నది."

రాష్ట్ర (ప్రావిన్స్) లలో భూమి విషయంలో యింకా గందరగోళమూ, ఘర్షణలూ వుంటాయని ఎవరో అనగా "అదంత ముఖ్యంకాదు. ఈ కార్యక్రమం అర్థం చేసుకున్నారంటే దీని ప్రాముఖ్యతను గ్రహించారంటే అన్ని సమస్యలూ వాటంతటవే సర్దుకుంటాయి" అని ఆయన వెంటనేజవాబిచ్చాడు. "సోవియట్ల కాంగ్రెసులో రైతాంగ సమావేశాలప్రతినిధులు, వ్యక్తంచేసిన డిమాండ్లు ప్రాతిపదికగా ఈ డిక్రీ రచించబడింది కనుక దీనికి రైతాంగం ప్రత్యేకించి స్వాగతం చెపుతుంద"ని ఆయన వివరించడం ప్రారంభించాడు,

"ఔను కాని ఈ డిమాండ్లు సోషలిస్టు-రెవల్యూషనరీలు పెట్టారు, మనం వాళ్ళనుంచి అరువు తెచ్చుకున్నామని వాళ్ళంటారు" అని అన్నారెవరో.

లెనిన్ మందహాసం చేసాడు.

"అననీ వాళ్ళ న్యాయమైన కోర్కెలను బలపరుస్తామని రైతాంగం స్పష్టంగా అర్థంచేసుకుంటుంది. మనం రైతులతో వారి జీవన విధానంతో వాళ్ళ ఆకాంక్షలతో సరియైన అవగాహనతో వుండాలి. ఎవరైనా మూర్ఖులు మనల్నిచూసి నవ్వితే నవ్వనీ రైతాంగంమీద సోషలిస్టు-రెవల్యూషనరీలకే గుత్తాధికారం యివ్వాలని మనం ఎప్పుడూ అనుకోలేదు. మనం ప్రభుత్వ ప్రధానపార్టీ. కార్మికవర్గం నియంత్రం తర్వాత రైతాంగ సమస్య ప్రాధాన్యం వహిస్తుంది,"

భూమిశాసనం ఆ సాయంత్రమే కాంగ్రెసులో ప్రకటించబడాల్సి ఉన్నది. దాన్ని వెంటనే టైపుచేయించి పత్రికలకు పంపిస్తేకాని తెల్లవారి పత్రికలలో అదిరాదు అప్పుడు లెనిన్‌కు యింకో ఆలోచన వచ్చింది. ఈ శాసనానికి విస్తృత ప్రచారం యివ్వాలి. ప్రభుత్వ సమాచారాలన్ని కూడా వార్తాపత్రికలు విధిగా వేసేట్లు చేయాలని.

భూమిశాసనం విడిగా చిన్నబుక్‌లెట్‌గా 50 వేల కాపీలు వేయాలని ముఖ్యంగా గ్రామీణప్రాంతాలకు తిరిగి వెళ్తున్న సైనికుల్లో పంచాలని కూడా నిర్ణయమైంది. ఎందుకంటే వారి ద్వారానే అధికసంఖ్యలో ప్రజలకు అది తెలుస్తుంది. తర్వాత కొద్ది రోజుల్లోనే అది అద్భుతంగా జనంలో ప్రచారమైంది.

వెంటనే మేము పార్టీ కేంద్ర కార్యాలయానికి బయల్దేరాము. కొంతదూరం నడిచి ట్రాము ఎక్కాము. వీధుల్లో ఎంతో క్రమశిక్షణతో మసలుతున్న జనాన్ని చూసి లెనిన్ చెక్కిళ్ళలో తృప్తి తొణికిసలాడింది. సాయంత్రంకోసం ఆయనెంతో తహ

తహగా ఎదురుచూసాడు. రెండవ అఖిల రష్యా కాంగ్రెసు శాంతి శాసనాన్ని ఆమోదించగానే ఆయన స్పష్టమైన స్వరంతో భూమిశాసనాన్ని చదివాడు. గొప్ప ఉత్సాహంతో అది ఏకగ్రీవంగా ఆమోదించబడింది.

శాసనం ఆమోదించబడిన వెంటనే నేనొక మనిషిద్వారా దాన్ని పెట్రోగ్రాడ్ వార్తాపత్రికల కార్యాలయాల కన్నింటికి పంపించాను. ఇతర పట్టణాలకు టెలిగ్రాఫ్ ద్వారా పంపించడానికి పోస్టాఫీస్‌కు పంపించాను. మా వార్తాపత్రికలు ఈ శాసనాన్ని అప్పటికే కంపోజ్ చేసివున్నాయి. మరునాడు ఉదయం లక్షల, దశలక్షల జనం దాన్నిచదివారు శ్రామిక ప్రజలు ఎంతో ఉత్సాహంతో దాన్ని అభినందించారు. బూర్జువావర్గం తమ వార్తాపత్రికల్లో పెడబొబ్బలు పెట్టారు. పలవరించారు. కాని ఆ సమయంలో వాళ్ళను పట్టించుకున్న దెవరు.

లెనిన్ విజయోత్సాహంతో వున్నాడు.

"ఇదొక్కటే మన చరిత్రపై రానున్న ఎన్నో కాలాలకు ఒక ముద్రవేస్తుంది" అన్నాడాయన.

సృజనాత్మక విప్లవకార్యాచరణలో సుసంపన్నమైనకాలం ఎంతోవిజయవంతంగా ప్రారంభమయింది. లెనిన్ చాలా కాలందాకా కూడా ఈ శాసనంలో ఆసక్తి చూపాడు. పత్రికల్లో వచ్చిన ప్రచురణలే కాకుండా ఈ శాసనం ఎన్ని కాపీలు రైతాంగంలోను, సైనికుల్లోనుపంచారని అడుగుతుండేవాడు. బుక్‌లెట్‌గా ఇది లెక్కలేనన్నిసార్లు అచ్చయి రష్యాలోని చిన్న జిల్లా కేంద్రానికి కూడా పంపించబడింది.

భూమిశాసనం నిజంగానే సార్వజనీనంగా ప్రచారమయింది. యింకే శాసనం కూడ బహుశ ఇంత విస్తృతంగా ప్రచారం కాలేదు. మన నూతన సామ్యవాద శాసనాల్లో భూమిశాసనం నిజంగా ఒక మౌలికమైన శాసనం. ఈ శాసనంకోసం లెనిన్ తన శక్తిసామర్థ్యాలన్నింటినీ వినియోగించాడు. దీని కద్భుతమైన ప్రభావం వుందని భావించాడు.

వ్లాడిమిర్ బోంచ్ - బ్రియెవిచ్

---

కోటి తుపానులను శతకోటి భూకంపాలను
ఎదుర్కొన సాహసిస్తాం
లెనిన్ అంటే పోరాటం లెనినంటే విప్లవం
కార్మిక నియంతృత్వం లెనిన్ ప్రతీక
అజేయం లెనినిజం, లెనినిజం అభేద్యం.

---

# సోషల్ సామ్రాజ్యవాదం – సోల్జెనిత్సిన్

యూసుఫ్ లాల్

రష్యా సాహిత్యకారుడు సోల్జెనిత్సిన్‌కు నోబెల్ బహుమతి లభించడం, దానికి సోవియట్ విరోధం భూమిక కావడం, దేశ బహిష్కరణ– ఇవన్నీ అటు పశ్చిమదేశాల్లోనూ, ఇటు భారత దేశంలోనూ పత్రికలకు మంచి మేత అయింది. కళాకారులకు, సాహిత్యకారులకు, మానవసమాజంలో వ్యక్తిస్వాతంత్ర్యము – ప్రజాస్వామ్య హక్కులు అడిగినందుకు, రష్యా ప్రభువుల గద్దెకు విరుద్ధంగా విద్రోహం చేసినందుకు యీ మహనీయుడైన సాహిత్యకారుడు అమానుషమైన యాతనలు, చివరకు దేశ బహిష్కరణ– అనుభవించాల్సి వచ్చిందని యీ పత్రికలు రాసాయి అందుకే అతని దుస్థితికి తమ దుఃఖాన్ని వ్యక్తం చేయడంకోసం అమెరికా పత్రికలు పెట్రోలు సంక్షోభం, డాలర్ సంక్షోభం, వాటర్‌గేట్ సంక్షోభం వంటి తీవ్రమైన సమస్యలను కూడ సోల్జెనిత్సిన్ సంక్షోభం ముందర వెనక్కి నెట్టేసినవి. ఇంగ్లాండ్‌లో సాధారణ ఎన్నికలు ఇతర దేశ సమస్యలు సోల్జెనిత్సిన్ ముందు అప్రధానమైనవిగా కనిపించాయేమో పత్రికల్లో లోపలిపేజీల్లోకి తోసివేయబడ్డాయి. లండన్ టైమ్స్ పత్రికావ్యాఖ్యాత స్టెయిన్లీ రెనల్డ్స్ కూడ ఇది అకారణమైన ప్రాముఖ్యమివ్వడమేనన్నాడు. రచయితగా సోల్జెనిత్సిన్ మహత్తరవ్యక్తేమీ కాదు, నిజానికి ఒక అజ్ఞాత వ్యక్తి. స్టాలిన్ వ్యతిరేక కృశ్చేవ్ దాడిలో ఈయన జెండామీదికి వచ్చాడు. కాని కమ్యూనిస్టు వ్యతిరేకతవల్ల మాత్రమే అతణ్ణి "ప్రతిభాశాలియైన మహత్తర కళాకారుడు"గా అంగీకరించ లేము. యిది రెనల్డ్స్ అభిప్రాయం. రెనల్డ్స్ ఏమన్నప్పటికీ, సోల్జెనిత్సిన్‌కు యింతకు ముందే ఆయన 'అసాధారణ' రచనా కౌశల్యానికి నోబుల్ బహుమతి లభించింది. అమెరికా ఇంగ్లాండు ఇంకా యితర పశ్చిమ యూరపుదేశాలన్నిటా ప్రభుత్వం సన్మానించేస్థాయిలో సాదరమైన ఆహ్వానాలు లభించాయి చాల సంవత్సరాల క్రితం బోరిస్‌పాస్టర్‌నాక్ గురించి కూడ పశ్చిమ దేశాలు ఇలాంటి హంగామానే చేశాయి. స్టాలిన్ కూతురు స్వెత్‌లానా కమ్యూనిస్టు వ్యతిరేకతనుకూడ సామ్రాజ్యవాద దేశాలు ఎంత ప్రచారానికి వీలయితే అంత ప్రచారానికి వాడుకున్నాయి. ఇవన్నీ ఇప్పుడు విస్మృతిపాలయ్యాయి. రష్యా భౌతిక శాస్త్రవేత్త సఖరోవ్ కాని, సోల్జెనిత్సిన్‌కాని వీటికి అపవాదమేమీకాదు. అయినా, ఈ సోల్జెనిత్సిన్ ఎవరు? ఆయనచుట్టే 'మానవత సంకటగ్రస్తమయింద'నే ఈ హోరు ఎందుకు వ్యాపించింది? అనే ప్రశ్నలు ఉదయించక మానవు.

వాస్తవంలో సోవియట్ రచయితల సంఘంలో సోల్జెనిత్సిన్ ఏమంత ప్రఖ్యాతికెక్కిన సభ్యుడు కాదు. అయినా కృశ్చేవ్–బ్రెజ్నేవ్ ముఠాలపాలనలో సాగుతున్న

రష్యాలో ఆయనకు విశిష్టమైన మర్యాద లభించింది. స్టాలిన్‌కాలంలో 'శ్రమశిబిరం'లో ఖైదీగా జీవితం గడపడమే ఆయన కమ్యూనిస్టు వ్యతిరేక, తిరోగమనవాద వర్గచరిత్రకు నిస్సందేహమైన ప్రమాణం- వాళ్ళకు కావలిసిందదే. సోవియట్ వ్యతిరేకంగా సామ్రాజ్యవాదుల ద్వారా పోషించబడుతున్న గూఢచారి సభ్యుడనే అనుమానంపైఅతన్ని అరెస్టు చేశారు. విచారణలో అతని విద్రోహ చర్యలు బయటపడ్డాయి. అందుకే 1945 నుండి 1956 దాకా అతడు శ్రమ శిబిరంలో గడపాల్సి వచ్చింది. బోరిస్ పాస్టర్‌నాక్ వలెనే యితడు కూడ బద్ధ స్టాలిన్ విరోధి, కమ్యూనిస్టు విరోధి. జార్ సామ్రాజ్యానికి నిష్ఠాపరుడైన సమర్థకుడు ఇంక చరిత్ర గతిని వెనక్కి తిప్పి జార్ ప్రభుత్వాన్ని పునస్థాపించడం అసాధ్యంఅని తెల్సుకుని, పెట్టుబడిదారీ విధానాన్ని పునరుద్ధరించే కృశ్చేవ్ ముఠాకు శక్తివంచనలేకుండా తోడ్పడ్డాడు. కృశ్చేవ్ కాలంలో 1956లో అతన్ని నిస్సిగ్గుగా విడుదల చేయడమనేది ఊహించదగిన సన్మానమే. తర్వాత షోలోఖోవ్-ఎహ్రెన్‌బర్గ్ వంటి "శాంతివాద" రచయితల సామ్యవాద-సామ్రాజ్యవాద సౌభ్రాతృత్వ నినాదాలలో కలిపి విప్లవ ప్రతీఘాతుకవర్గ సామరస్య నూతన సిద్ధాంతాన్ని కూడ ఇతడు ప్రచారంలో పెట్టాడు. సఖరోవ్, సోల్జెనిత్సిన్ ఏకకంఠంతో- స్టాలిన్ హిట్లర్‌కన్న ప్రమాదకరమైనవాడు, స్టాలిన్‌వాదం, ఫాసిజం రెండూ ఒకటే- వాటిలో ఏమీ తేడా లేదు- అని ఘోషించారు.

తర్వాత 1958లో సోల్జెనిత్సిన్ కృశ్చేవ్ సూచనపై అతని సంరక్షణలో 'ది గులాగ్ ఆర్కిపెలాగో 1918-56' రాయడం ప్రారంభించాడు. ఈ స్టాలిన్ వ్యతిరేక కుత్సిత రచనను కృశ్చేవ్ స్టాలిన్‌ను భూస్థాపితం చేయాలన్న తన ప్రయత్నంలో బ్రహ్మాస్త్రంగా వాడుకోవాలనుకున్నాడు. సోల్జెనిత్సిన్ తనపై వుంచిన యీ భారాన్ని నిర్వహించి దీర్ఘమైన పది సంవత్సరాలలో 1969లో తన స్టాలిన్‌వ్యతిరేక, కమ్యూనిస్టువ్యతిరేక ప్రచార గ్రంథాన్ని పూర్తి చేసాడు.

ఈ మధ్యకాలంలో సోవియట్ రష్యాలో సామ్రాజ్యవాద స్థాపన జరిగింది, మరొకవైపు మార్క్సిజం-లెనినిజంపై ఆధారపడి విప్లవ ప్రజానీకం కూడ విప్లవ ప్రతీఘాతుక శాసకులకు వ్యతిరేకంగా పోరాటం చేపట్టి సంఘటితమయ్యారు. ఈ పోరాట ఫలితమే సోవియట్ పాలకులు తమ నగ్నమైన స్టాలిన్ వ్యతిరేక కుట్రకు నేర్పుగా రూపం మార్చి, యీ కుట్రను బహిరంగంగా చేసిన కృశ్చేవ్‌ను 'దించివేసి' తాము పదవిలోకి వచ్చారు. కృశ్చేవ్ స్థానంలోనే కూర్చొని తాము కృశ్చేవ్ విరోధులమని భ్రమింపచేదామని బ్రెజ్నెవ్-కొసిగిన్ ముఠా ఆశించింది. నిజానికి వాళ్ళ

కృశ్చెవ్ మార్గాన్నే అనుసరిస్తూ ప్రపంచమంతటా విప్లవ ప్రతిఘాతుక లక్ష్యాన్ని సాధించడంలో స్థిరనిశ్చయంతో సాగుతున్నారు. అయినా కాసేపటి కొరకు, వాళ్ళు వేసుకున్న వేషాలు చూసి జనం పొరపాటు పడింది.

ఈ పరిస్థితుల్లో సోల్జెనిత్సిన్ 'ది గులాగ్ ఆర్కిపెలాగో 1918-56' పూర్తి చేసాడు. సోవియట్ శ్రమశిబిరం గాథ ద్వారా సోవియట్ దేశంలో 'దమనపీడన-పైశాచికపాలన' లను పాదుకొల్పడానికి లెనిన్, స్టాలిన్‌లు కారణమని, వాళ్ళను నేరస్తులుగా బోనెక్కించడం దీని మూల లక్ష్యం. ఈ దీర్ఘమైన రచన మొదటి రెండు భాగాల్లో లెనిన్-స్టాలిన్ కాలంలో అమానుష దమనపీడన-దుఃఖం గురించి రాసాడు. రచయిత స్వంత అనుభవాలు యీ గాథలను సమృద్ధిచేసాయి. ఒక డాక్యుమెంట్‌లాగా సమకాలీన పత్రికలను, 227 ప్రత్యక్ష సాక్ష్యాలను సాక్షంగా చూపాడు. రోమాలు నిలిచేలా చేసిన శ్రమశిబిర వర్ణనలో కష్టంగా యిరవైమందినయినా యిరికించడానికి వీలులేని గదుల్లో మూడువందల యిరవైముగ్గురిని వుంచారని రాసాడు. ఇలాంటి యింకా ఎన్నో 'వాస్తవాలు' రాసాడు. ఇవి అవిశ్వసనీయాలూ చారిత్రక అసత్యాలు అయి కూడ కృశ్చెవ్ ఆలోచనా కార్యాన్వయం కోసం కథగా అపరిహార్యమయినవి. కాని ఈ మధ్యలోనే రష్యా పాలకవర్గాల ఎత్తుగడలు మారడంవల్ల, ప్రజల సంఘటిత ప్రతిఘటన తీవ్రతరమవడం వల్ల రష్యాలో ఇలాంటి ఒక మహత్వ్వపూర్ణ 'చారిత్రక కీర్తిపురుషుణ్ణి' అభినందించడం అసంభవమయిపోయింది. ఈ భారాన్ని సామ్రాజ్యవాద దేశాలు తమ భుజాలమీద వేసుకున్నవి. రష్యాపాలకుల సంకటావస్థనుగ్రహించి సోల్జెనిత్సిన్ చారిత్రక రచనా ప్రచారాన్ని, ప్రశంసను విస్తారంగా సాగించి తమరుణాన్ని తీర్చుకున్నవి. జర్మన్ భాషలో ఈ పుస్తకం ఏభైవేల కాపీలు ఒక్కవారంరోజుల్లో అమ్మినవి. ఇంగ్లీషు అనువాదాన్ని ప్రచురించే బాధ్యత హార్పర్ అండ్ బ్రదర్స్ తీసుకున్నదే తడవుగా అచ్చుకాకముందే పదిలక్షల కాపీలకు ఆర్డర్స్ వచ్చాయి. నోబుల్ బహుమానమూ ప్రచురణకర్తలనుంచి వచ్చినడబ్బూ కలిసి సోల్జెనిత్సిన్‌కు విదేశ బ్యాంకుల్లో లక్షలపౌండ్లు, డాలర్లూ జమ అయినవి.

ఇదంతా జరిగాకనే రష్యాపాలకులు తమ భ్రమాత్మక ప్రచారంలో ఆఖరిమజిలీగా సోల్జెనిత్సిన్ అభిశంసన అనే అంశాన్ని చేర్చారు. పాశ్చాత్య పత్రికలు ఈ 'విప్లవ' సాహిత్యకారుడు తన దేశంలో సాంఘికచ్యుతిని సమాజ బహిష్కరణను అనుభవిస్తూ ఎన్నో యాతనలు పడుతున్నాడని రాసినవి. అంటే లెనిన్, స్టాలిన్‌ల గురించి 'నిజం చెప్పిన నేరానికి, సోవియట్ పాలకుల ఆగ్రహానికి గురియై తీవ్రమైన శిక్షలు అనుభవిస్తు

న్నాడన్నమాట! చివరకు దేశం నుండి బహిష్కరించ బడుతాడు. స్విట్జర్లండ్‌లో ఆశ్రయం పొందుతాడు. ఇటీవలే అమెరికన్ పౌరసత్వం కూడ ఇచ్చారు.

ఈ ఘటనలన్నీ ఒక పథకం ప్రకారం జరిగినవే. పాశ్చాత్య పత్రికలు రష్యన్ పాలకులతో చేసుకున్న ఒప్పందం ప్రకారమే వార్తలు వేస్తూ పోతున్నవి. ఈ పథకం వెనుక రెండు ఉద్దేశ్యాలున్నవి. మొదటిది రష్యాప్రజల్లోనూ బయటా— ముఖ్యంగా ఆసియా, ఆఫ్రికా ప్రజల్లో రష్యాలోవున్న పాలకవర్గం లెనిన్–స్టాలిన్ పంథానుంచి ఇసుమంతయినా పక్కకు జరుగలేదనే భ్రాంతి వ్యాపించాలి. అదే నిజమయితే వాళ్లు సోల్జెనిత్సిన్‌ను దేశంనుంచి బహిష్కరించకుండా దేశంలోనే నిర్బంధించేవాళ్లు. రెండవది, రష్యాలో కూర్చుండబెట్టి ప్రజల ఆగ్రహానికి గురియైన సోల్జెనిత్సిన్‌కు యే సన్మానం చేయడం సంభవంకాదో, సామ్రాజ్యవాద దేశాల వొడిలో కూర్చుండబెట్టి ఆ సన్మానం నిరభ్యంతరంగా చేసుకోవచ్చు. లెనిన్–స్టాలిన్ వ్యతిరేక కుట్ర సోవియెట్ పాలకులకు చాలా విలువయిన విషయం. అందుకోసం సోల్జెనిత్సిన్-సఖరోవ్-స్వెత్లానాలను కాపాడుకోవడం వాళ్ళకు చాల అవసరం. అయితే తమ 'కమ్యూనిస్టు' ముసుగును తొలగించకుండానే దేశంలో ఇతర దేశాల్లో విప్లవ పోరాటాలకు వెన్నుపోటు పొడిచే బాధ్యతను కూడా నిభాయించుకోవాల్సి వుంటుంది. రష్యాలో ఈనాడున్న పాలకవర్గం తనతుతాను 'లెనినిస్టు' అని పిలవబడాలని కోరుకుంటున్నది. ఈనాడుకూడా అక్కడున్న పెట్టుబడిదారీ వ్యవస్థను సామ్యవాద వ్యవస్థగానే చెప్పుకొని నడిపించ జూస్తుంది. అందుకే సోల్జెనిత్సిన్ వాళ్ళ సూచనల ప్రకారమే సామ్రాజ్యవాదానికీ,విప్లవ ప్రతీఘాతుకానికి ప్రచారంచేసే కార్యక్రమం చేపట్టినప్పటికీ రష్యాలో కూర్చుని సామ్యవాద వ్యవస్థకు వ్యతిరేకంగా బురదచల్లడం ప్రారంభిస్తే తమ అసలు స్వరూపాల్ని దాచడం కష్టమవుతుంది. అందుకోసం సోల్జెనిత్సిన్‌ను 'దేశద్రోహి'గా ప్రకటించి ప్రమాదంలేని సామ్రాజ్యవాద ఆశ్రయంలో చేర్చింది. దానితోపాటే ఆయన సంచితం చేసిన సంపదలతోపాటు ఆయన పరివార వర్గాన్ని కూడ ఆయనతో కలిసే అధికారం యిచ్చింది.

ఇంతకూ, రష్యా నేతలు సోల్జెనిత్సిన్ కుత్సితాన్ని గురించి లెనిన్-స్టాలిన్‌ల పక్షాన ఒక్కమాట అనలేదు. అబద్ధపు ఝుంఝూటాన్ని తొలగించి సత్యాన్ని స్థాపించ డానికి ఏమాత్రం శ్రమపడలేదు. వాళ్ళ ఆచరణలో అందరికీ అర్థమయిందేమంటే సోల్జెనిత్సిన్ ఏదైతే చెప్పాడో అదంతా నిజమే అని. అతడు రాసిన విషయాలన్నీ చరిత్రనుంచి తీసుకున్నవనీ, అనుభవం గీటురాయిగా కాచివడబోసినవని అందరు సమ్మేలాగానే సోవియట్ నాయకుల ఆచరణ వున్నది,

సోల్జెనిత్సిన్ ప్రయోగం సఫలమైతే, ఇవశెంకో మొదలయిన స్టాలిన్‌వ్యతిరేక రచయితల పౌరసత్వ హక్కులను కూడ రద్దుపరిచి వాళ్ళకు కమ్యూనిస్టు వ్యతిరేక విప్లవ ప్రతీఘాతుక దేశాల్లో విశేషప్రచారం యిప్పించాలని సోవియట్ పాలక ముఠా ఒక పెద్ద పథకం వేస్తున్నది. కాని సోల్జెనిత్సిన్ కూడ స్వెత్లానావలె పట్టుబడిపోయి తన స్టాలిన్‌వ్యతిరేక, కమ్యూనిస్టువ్యతిరేక రచనల వెనుకవున్న పథకాన్నంతా బయట పెట్టి అసలు రూపాలను పరిచయంచేస్తే। ప్యారిస్ నుంచి ప్రచురించిన తన పదివేల శబ్దాల పత్రంలో ఆయన రష్యా నాయకులకు మార్క్సిజం ముసుగును తీసేసుకుని మార్క్సిజాన్ని నేరుగానే విసర్జించమని సలహా యిచ్చాడు. ఆయనకు ఎక్కువ భయం చైనాతో వున్నది- చైనా నాయకులు చేస్తున్న సిద్ధాంతపోరాటంతో వున్నది. అందుకే మార్క్సిజమ్ కాలం చెల్లిపోయిందని ప్రకటించి చాలా క్షేమంగా చైనాకు చాలా దూరంగా బతకాలని కోరుకుంటున్నాడు.

---

కథ :

# బురదలో స్త్రీ

మాగ్జిమ్ గోర్కీ

అది ఎండాకాలం. ఆ రాత్రి నగరం శివార్లలో నేనొక వింత దృశ్యం చూసాను. ఒక పెద్ద బురద మడుగులో నిలబడి ఒక స్త్రీ కాళ్ళతో తొక్కుతూ చిన్నపిల్లలా బురదతో ఆడుకుంటున్నది. అస్పష్టంగా ఏదో బూతుపాట పాడుతున్నది ఆమె.

పగలు బ్రహ్మాండమైన తుఫాను వర్షంతో బంకమన్ను నేలంతా నాని వీధి బురదబురదగా ఉన్నది. ఆమె మోకాళ్ళ వరకూ బురదలో కూరుకుపోయి వున్నది. ఆమె కంఠం వింటే ఆమె తాగినట్టు తెలుస్తున్నది. నృత్యం చేస్తున్న ఆమె అలసిపోయి బురదలో పడిపోతే చాలా సులువుగా మొత్తంగా బురదలో కూరుకుపోతుంది.

నేను బురదలో దిగి భుజాలు పట్టుకొని ఆమెను పొడి నేలమీదికి లాగుకొచ్చాను. మొదట ఆమె భయపడినట్టున్నది. అందుకే లొంగిపోయినట్టుగా నన్ను అనుసరించింది. కాని ఆ వెంటనే ఒళ్ళంతా తిప్పి తన కుడిచేయిని విడిపించుకొంది. నాగుండెపై ఒక్కటి చరిచి "రక్షించండి–రక్షించండి" అని అరిచింది.

మరు నిముషం మళ్ళీ బురదలోకి పోయింది– నన్నుకూడా లాక్కొని.

"పాపిష్టోడా! నేనురాను, నీతో నే నుండను, నేను లేకుండా బతుకు.... అయ్యో! రక్షించండి."

చీకట్లో నుంచి ఒక కావలివాడు వచ్చి అయిదడుగుల దూరంలో ఆగి చిరచిరలాడుతూ అడిగాడు: "ఏమిటీ అల్లరి?"

ఆమె బురదలో కూరుకుపోతుందేమో అని నేను భయపడుతున్నాననీ, బురద నుంచి బయటకు లాగడానికి ప్రయత్నిస్తున్నాననీ చెప్పాను. కావలివాడు తాగివున్న ఆమెను ఒకసారి నిశితంగా చూసి బిగ్గరగా అరిచాడు "మష్కా బయటకు రా!"

"నేను రాను"

"రమ్మంటున్నాను, రా!"

"నేను రాను"

"ముండా! తన్నులు కావాలా?" అని మెల్లగా అడిగి, తర్వాత నా వైపు తిరిగి మాట కలిపాడు: "ఈ ప్రాంతంలో వుండేదే. నారతీసే పని చేస్తుంది. మష్కా ఫ్రోలిఖా, సిగరెట్ వుందా?"

మేం సిగరెట్లు అంటించుకున్నాం.

"దొరలు! నాకు నేనే దొరను. నాకిష్టమైతే ఈ బురదలో మునుగుతాను"

"వీపుమీద ఒక్కటి చరిచి నేనే ముంచుతా నుండు.'' ముసలివాడైనా బలంగా వున్నాడు ఆ కావలివాడు. గడ్డం వుంది. "ప్రతి రాత్రి యిట్లానే అల్లరి చేస్తుంది. ఇంటిదగ్గర దీనికొక కాళ్ళులేని కొడుకున్నాడు."

"ఆమె యిల్లు ఇక్కడికి చాలా దూరమా?"

నా ప్రశ్నకు జవాబు చెప్పకుండానే కావలివాడు అన్నాడు: "దీన్ని చంపాలి"

"ఎవరయినా ఆమెను ఇంటికి తీసుకుపోతే బాగుండు!"

కావలివాడు బుసకొట్టి, తన సిగరెట్ వెలుగులో ఓసారి నన్ను బాగా చూసి, బురదలో గట్టిగా అడుగులేస్తూ వెళ్ళిపోయాడు.

"తీసుకుపో! కాని ముందు ఒక్కసారి దాని మొహం చూడు''

ఆమె బురదలో కూచుంది. చేతులను బురదలో ఆడిస్తూ "సముద్రంలో... పడవ నడుపుతున్నా..." అని పాట పాడుతోంది.

నేను మళ్ళీ బురదలోకి దిగాను. చంకల క్రింద చేతులువేసి ఆమెను ఎత్తి నా మోకాళ్లతో నెట్టుతూ, బయటకు మోసుకొచ్చాను, ఆమె నన్ను అదగించింది. చేతులు ఊపుతూ నాతో సవాల్ చేసింది: "రా! కొట్టు! ఎవతి లెక్కచేస్తుంది! పందీ!... రా...రా! కొట్టు."

ఆమెను అక్కడ కంచెకు ఆనించి నిలబెట్టి తన ఇల్లెక్కడో అడిగాను. తాగి వున్న ఆమె తలెత్తి తన పుసికట్టిన కళ్ళతో నన్ను చూసింది. ఆమె ముద్ద ముఖం ముక్కు లోపలికి పోయివుంది. పైకి తిరిగి వున్న పెదవిపై ఏదో కురుపుమచ్చ. పళ్లు కొన్ని బయటపెట్టి ఆదోలా నన్ను చూసింది: "మంచిది, నాతో రా!"

తడిసిన ఆమె లంగా అంచు నా కాళ్ళను తాకింది.

"నా వెంట రా, ప్రియుడా!" మత్తులోంచి బయటపడ్డట్టుగా మాట్లాడింది: "నీతో తగవు పడను. నిన్ను సుఖపెడతా."

రెండంతస్తులున్న పెద్ద యింటికి నన్ను తీసుకుపోయింది. బండ్లూ, పీపాలూ, ప్యాకింగ్ డబ్బాలూ, కట్టె మోపులతో నిండివున్న బాటలో గుడ్డిదానిలా, జాగ్రత్తగా, నడుస్తూపోయి ఒక కంత దగ్గర ఆగింది,

"వంగు."

బంకగావున్న గోడకానుకొని, వాలిపోతున్న ఆమె పడిపోకుండా నడుం చుట్టూ ఒక చేయివేసి, జారుతున్న మెట్ల మీదుగా నేను దిగాను. చీకటిలో తడవి తలుపు ఎక్కడుందో చూసాను. తలుపుతీసి, ముందుకుపోను తటపటాయిస్తూ, ఆ నల్లని కంత ముందు ఆగిపోయాను.

"అమ్మా ! నువ్వేనా ?" ఆ చీకట్లోంచి ఓ చిన్నకంఠం వినిపించింది.

"ఆఁ... నేనే "

పాడువాసన. ఒక అగ్గిపుల్ల వెలిగింది. ఆ వెలుగులో ఒక పసివాని పాలిపోయిన మొహం ఒక్క క్షణంపాటు కనిపించింది.

"నేనే. నేను కాక యింకెవరు ?" అంటూ ఆమె తన బరువంతా నామీదవేస్తూ మళ్ళా అన్నది.

మరో అగ్గిపుల్ల వెలిగింది. ఏదో గాజు చప్పుడు. బక్కపలుచని చేయి ఒకటి చిన్న నూనెదీపం ముట్టించింది.

"నా బంగారుకొండ" అంటూ ఆమె వంగి ఆ మూల కుప్పగా కూలిపోయింది. ఆ ఇటుక-నేలకు అంటుకుని ఒక పడకవుంది.

భగ్గుమంటూ, పొగ బాగావిడుస్తున్న దీపం వత్తిని చిన్నగాచేసి జ్వాలను కాపాడుతున్నాడు ఆ పసివాడు. ఆ పసివాని ముఖం గంభీరంగావుంది. మంచి బ్రష్‌తో తీర్చిదిద్దినట్టున్న ఆ ముఖం ఆ చీకటి కంతలో అతకనట్టుగా వున్నది. నన్ను చూస్తూ అడిగాడు: "తాగిందా ?"

ఆ పసివాని తల్లి గురకపెడుతూ, ఆ మంచంలో పడివుంది.

"ఆమె బట్టలు విప్పేయాలి"– అన్నాను నేను.

"విప్పేయి" కళ్ళు వాల్చుకొని జవాబిచ్చాడు పసివాడు.

తడిసిన ఆమె బట్టలు నేను విప్పుతుంటే చాలా నెమ్మదిగా అడిగాడు: "దీపం ఆర్పేయనా ?"

"ఎందుకు ?"

జవాబు రాలేదు. పిండిబస్తాలాగా ఆమెను అటుయిటు కదుపుతూ బట్టలు విప్పుతూ ఆ పసివాణ్ణి గమనించాను. కిటికీ కింద నేలమీద ఒక ప్యాకింగ్ డబ్బాలో కూచునివున్నాడు. ఆ డబ్బాపై ఏదో కంపెనీపేరూ, "జాగ్రత్తగా సంబాళించండి" అన్న మాటా రాసివున్నాయి.

ఆ చదరపు కిటికీ అడుగుభాగం తాకుతూన్నది ఆ పసివాని భుజం. గోడవెంట బీరువాల వరుస. వాటిపై సిగరెట్ల, అగ్గిపుల్లల పెట్టెలు. పసివాని పక్కకే వున్న మరో డబ్బా టేబుల్‌లా పనిచేస్తున్నట్టున్నది. చేతులు మెడవెనుక కలిపి కిటికీ అద్దంలోకి చూస్తున్నాడు.

ఆమె బట్టలు విప్పి కుంపటిమీద వెచ్చచేసాను. చేతులు కడుక్కొని చేతి తువ్వాలుతో తుడుచుకుంటూ "మంచిది, వెళ్ళొస్తా" అన్నాను. ఆ పసివాడితో.

నన్ను చూసి అస్పష్టంగా అన్నాడు: "ఇప్పుడు దీపం ఆర్పనా ?"

"నీ ఇష్టం."

"నువు వెళ్ళితున్నావా ? పడుకోవా ?" బక్కపలుచని చేయితో తల్లినిచూపిస్తూ అన్నాడు "ఆమెతో"-

"ఎందుకు ?"

"నీకే తెలియాలి." చాలా అమాయకంగా అన్నాడు: "వాళ్ళంతా పడుకుంటారు కద ?"

తత్తరపడుతూ చుట్టూ చూసాను.

"ఇంకాసేపు నీతో కూచోనా ?" అని అడిగాను.

చిరచిరలాడుతూ నన్ను చూసి యిలా అన్నాడు: "పొద్దటిదాకా లేవదు. నీకు తెలుసా ?"

"ఆమెతో నాకు పనేమీ లేదు."

నేను ఆ పసివాని పక్క కూచుని వాళ్ళ అమ్మ నాకెట్లా కలిసిందో చెప్పాను.

ఇప్పుడు ఆ పసివాణ్ణి చాలా దగ్గరగా చూడగలుగుతున్నాను.

"నీ కాళ్ళకేమయింది ?"

ఆ చింపిగుడ్డల్లో ఏదో తడవి, పోకర్‌లాగా వున్న ఒక ఆవిటి కాలును చేతితో లేపి డబ్బా అంచుమీద పెట్టాడు.

"ఎట్లా వున్నాయో చూడు. రెండు కాళ్ళూ యింతే పుట్టినాటినుంచీ యిట్లే వున్నాయి. నడవలేను. ఒట్టి దండగ- ఈ కాళ్ళు."

"ఈ చిన్నపెట్టెల్లో ఏమున్నాయి ?"

"చూస్తావా ?" ఒక కట్టెను తీసినట్టు కాలును చేతితోలేపి మళ్ళీ చింపిగుడ్డల్లోకి దూర్చి ప్రేమగా నవ్వుతూ అన్నాడు: "అయితే సరిగా కూర్చో. నీ జీవితంలో నువ్వెన్నడూ యిలాంటిది చూసుండవు."

ఆ పసివాని కుండవలసిన వాటికన్నా పొడుగ్గావున్న సన్నని చేతుల సాయంతో నెమ్మదిగా లేచి, బీరువాలపైనున్న పెట్టెలను ఒక్కొక్కటే తీసి నా కందించసాగాడు.

"జాగ్రత్త! తెరవకు. అవి ఎగిరిపోతాయి! చెవి దగ్గర పెట్టుకుని విను, ఆఁ"

"ఏదో కదలుతున్నది లోపల."

"ఆఁ అది సాలెపురుగు. మహచెడ్డది! జిత్తులమారిది" ముఖంపై నవ్వు నాట్య మాడింది. చాలా నేర్పుగా, తొందర తొందరగా పెట్టెలుతీసి, తన చెవిదగ్గర పెట్టు కొని, ఆతర్వాత నా కందిస్తూ ఉత్సాహంగా మాట్లాడుతున్నాడు— బొద్దింకలూ, ఈగలూ, పేడపురుగులూ గురించి. ఒక పేడపురుగు గురించి యిట్లా చెప్పాడు: "వీడు నికోడిన్ మామ, బయట పట్టుకొచ్చా. నిజానికి భిక్షమడుక్కునేవాడు. చర్చికోసం డబ్బు సేకరిస్తున్నానని చెప్పి తిరుగుతాడు. అమ్మ వీణ్ణి చవక సరుకు అంటుంది, అమ్మ ప్రియుళ్ళలో ఆపేరు వాడొకడున్నాడు. అమ్మకు ముక్కు లేక పోయినా ఆమె చుట్టూ ఈగల్లా బోలెడుమంది ప్రియుళ్ళు తిరుగుతారు."

"నిన్ను కొడుతుందా?"

"అమ్మా? నేను లేకుండా బతకలేదు. దయగలది, తాగుబోతుది— అంతే. అయినా ఈ వీధిలో అంతా తాగుబోతులే కద? అందంగా వుంటుంది కూడా అమ్మ... కాని తాగుబోతు, లంజె! తాగుడు మానవే, పిచ్చిదానా! ధనవంతురాలివవుతావు— అని చెప్తాను. కాని నవ్వుతుందంతే. మూర్ఖపుది ఏం చెప్పి ఏం లాభం! కాని మంచిది. నిద్రలేచాక చూద్దువుగాని..."

చాలా మనోహరంగా నవ్వాడు ఆ అందాల చిరునవ్వు చూసి, ఆ పసివానిమీద నాకు జాలి పుట్టుకొచ్చింది. నగరమంతా వినేలా బిగ్గరగా ఏడవాలనిపించింది. పలచని ఆ మెడమీద ఆ అందమైన తల ఒక వింత పుష్పంలా వూగింది. పుత్సాహమూ ఆనందంతో వెలుగులు చిమ్ముతున్న ఆ కళ్ళు- ఎదిరించలేని ఏదో శక్తితో నన్ను ఆకర్షించుకుంటున్నాయి.

ఆ పసివాని మాటలు వింటూ నేనెక్కడున్నానో మరిచిపోయాను కాసేపు. ఆతర్వాత వెంటనే జైలులాంటి ఆ కిటికీ, మట్టినేలా, ఆ స్టవ్ నల్లని కడుపూ, మూలన పాత తాళ్ళపీచు కుప్పా కనబడ్డాయి. తలుపు పక్కన చింపిగుడ్డలపైన ఆ స్త్రీ- తల్లి.

"బాగుంది కదా?" గర్వంగా అడిగాడు పసివాడు.

"చాలా బాగుంది."

"కాని నా దగ్గర చిమ్మటలూ, సీతాకోక చిలుకలూ లేవు."

"నీ పేరు?"

"లయొంకా"

"నాదీ అదే పేరు"

"నిజంగా? ఎటువంటి వానివి నువు?"

"ఆఁ... ఎటువంటివాడ్నీ కాదు"

"వేరే చెప్పు! ప్రతివాడూ ఏదో ఒకటి నాకు చెప్పాలి. నువు మంచివానివి"

"కావచ్చు"

"నాకు తెలుసు. నువు పిరికివి కూడా"

"పిరికి?"

"పందెం!"

చిరునవ్వు నవ్వాడు. నన్ను చూస్తూ కన్నుకొట్టాడు కూడా.

"నన్ను పిరికి అని ఎందుకనుకుంటున్నావు?"

"ఈ రాత్రికి బయటకు పోను భయం కాబట్టి నాతో కూచున్నావ్!"

"తెల్లారుతూనే వున్నది."

"నువు పోతావిక"

"నిను చూడ్డానికి మళ్లీ వస్తా"

ఆ పసివాడు నా మాటలు నమ్మలేదు. ఆ బంగారు కన్నుల్ని ఒకసారి మూసి ఒక క్షణం తర్వాత అన్నాడు: "ఎందుకు?"

"నీతో కూచుని మాట్లాడడానికి, నువంటే నా కిష్టం. మరి నేను రావచ్చా?"

"పో పో. ఎందరో వస్తారిక్కడికి"

ఒక శ్వాస తీసి అన్నాడు: "నాతో నవ్వులాట ఆడుతున్నావు"

"కాదు, నిజంగా నేనొస్తా"

"సరె, మంచిది. అయితె నా కోసమే రా! అమ్మకోసం కాదు, ఎవరిక్కావాలి అమ్మ? మనం ఇద్దరం స్నేహితులంగా వుందాం."

"సరె"

"నువు పెద్దవానివైనా ఫరవాలేదు మన స్నేహానికి. నీ వయసెంత?"

"ఇరవై ఒకటి నిండుతున్నాయి"

"నాకు పన్నెండు నిండుతున్నాయి. నాకు మంచి స్నేహితులెవరూ లేరు. నీళ్ళు మోసేవాని బిడ్డ కట్కా తప్ప. నన్ను కలవడానికి వస్తే కట్కాను వాళ్ళమ్మ కొడుతుంది. నువు దొంగవా?''

"కాదు. ఎందుకట్లా అడుగుతున్నావు?"

నీ మొహం అట్లా వున్నది సళ్కా, వానిచ్కా అని ఇద్దరు దొంగలు ఇక్కడికి వస్తుంటారు. ఒకడు మూర్ఖుడూ, జగడాలమారీ అయితే మరొకడు కుక్కలా దయగలవాడు. నీ దగ్గర చిన్న పెట్టెలేమైనా వున్నాయా?"

"కొన్ని తెస్తాలే"

"తప్పకుండా తే, నువ్వొస్తున్నట్టు అమ్మకు చెప్పను"

"ఎందుకని?"

"అది అంతే, మగవాళ్ళు వస్తారంటే అమ్మకు సంతోషం. వింతైన మనిషి. తనకు పదిహేనేళ్ళప్పుడు నేను పుట్టాను. ఎట్లా పుట్టానో తనకే తెలియదు. మళ్ళా ఎప్పుడొస్తావు?"

"రేపు సాయంత్రం"

"సాయంకాలానికల్లా తాగి వుంటుంది. మరి దొంగతనం చేయకుండా ఎట్లా బతుకుతున్నావ్?"

"బీరు అమ్ముతాను"

"అట్లానా? నాకో సీసా తేరాదు?"

"ఓ– అలాగే, మరి, పోతున్నా"

"సరె. మళ్లా వస్తావా?"

"తప్పకుండా"

తన పొడవైన రెండు చేతులూ చాచాడు. నేనా రెండు బక్క పలుచని, చల్లని ఎముకల్ని నా రెండు చేతుల్లోకి తీసుకొన్నాను. మళ్ళీ ఆ పసివానిని చూడకుండా, తాగినవానిలా నడుస్తూ కష్టంగా బయటపడ్డాను.

తెల్లవారుతున్నది అప్పుడు.

మరునాడు మా వీధిలోని పిల్లలచేత కొన్ని చిమ్మటలూ, సీతాకోకచిలుకలూ పట్టించాను, అందమైన చిన్నపెట్టెలు కొన్ని కొన్నాను. బీరు సీసా ఒకటీ, తేనె రొట్టెలూ, మిఠాయిలూ, బన్నుకూడా తీసుకొని లయొంకా దగ్గరికి పోయాను.

చాలా ఆశ్చర్యంతో, ఆనందంతో లయొంకా నా బహుమానాలు అందుకున్నాడు.

"ఓ! ఇవన్నీ చూడు! నువు ధనవంతుడివేకదా? అయితే ధనవంతునివై వుండీ యిట్లాంటి బట్టలు వేసుకోవడమేమిటి! దొంగవీ కానంటున్నావు? అరె ఎంత ముద్దుగా ఉన్నాయి ఈ పెట్టెలు! నా చేతులు కడుక్కోలేదు. ఈ పెట్టెల్ని ఎలా ముట్టుకోను!"

ఉన్నట్టుండి ఒక్కసారిగా అరిచాడు సంతోషంగా: "అమ్మా! రా! రా! కూచుని నా చేతులు కడగవే. చూడు ఆయనేం తెచ్చాడో. ఎవరో తెలుసా? పోలీసువానిలా రాత్రి నిన్ను లాక్కొచ్చాడే– ఆయనే. ఈయన పేరుకూడా లయొంకానే."

"ఆయనకు కృతజ్ఞతలు చెప్పాలి నువు"– శాంతంగా, వింతగా ఓ కంఠం వినిపించింది నా వెనుక.

పసివాని తల వూగింది "వేగంగా నమస్తే! కృతజ్ఞతలు''

వెంట్రుకల్లాంటి మట్టి ఎగిరిపడుతున్నది. మట్టిలోంచి– స్టవ్‌పైన కనిపిస్తున్న దుమ్ముపట్టిన తలను–నేను చూడగలుగుతున్నాను: ఒక స్త్రీ వికారమైన ముఖం, అప్రయత్నంగా వచ్చి నిలిచిన ఆ చిరునవ్వు వల్ల బయటపడ్డ ఆమె పళ్ళ కాంతి.

''నమస్తే"

"నమస్తే" ఆమె ప్రతినమస్కారం చేసింది. కళ్లు చిన్నగా చేసి నాకేసి ఎగతాళిగా చూసింది

లయొంకా తేనెరొట్టె తింటూ ఆడుకుంటున్నాడు. తల్లి తడి తువ్వాలు తీసుకొని లయొంకా దగ్గరికి పోయి ఎడమచేయి తీసుకొంది తన చేతుల్లోకి. ఒక చిమ్మట ఎగిరిపోతే లయొంకా అరిచాడు. ఆమె దాన్ని పట్టుకొని నన్నుచూస్తూ బాగా ఎరిగిన దానిలా అంది: "మా దగ్గర యివి చాలా ఉన్నాయి."

"దాన్ని వలపకు. ఓసారి తాగి పెట్టెమీద కూచుని బోలెడు చిమ్మటలను చంపేసింది."

"అది మరిచిపో బిడ్డా!"

"కుప్పలు కుప్పలు పాతిపెట్టా నేను"

"తర్వాత యింకొన్ని పట్టివ్వలేదా?"

"ఏం లాభం? నువు చంపినవన్నీ ట్రెయినింగు పొందిన చిమ్మటలు. నాకో సాలెపురుగు ఉండేది– యింకా– అమ్మ ప్రేమికుల్లో ఒకనిలా– వాడిప్పుడు జైల్లో వున్నాడు. లావుగా, ఉల్లాసంగా వుండేవాడు"

ఆ పసివాని జుట్టు సవరిస్తూ. నన్ను మోచేతితో మెల్లగా పొడిచి నవ్వుతూ అడిగింది: "బంగారు బిడ్డకదా? ఎంతమంచి కళ్లు!"

"టీ చేస్తానన్నావు— ఏమైందమ్మా?"

"పంచదార లేదు."

"పోయి కొనుక్కురా."

"డబ్బు లేదు."

"ఆయన దగ్గర తీసుకో." నావైపు తిరిగి, "మీ దగ్గర డబ్బేమైనా వుందా?"

ఆమెకు కొంత డబ్బిచ్చాను. గిన్నె తీసుకొని గబుక్కున ఆమె బయటకు పోయింది, ఏదో పాడుకుంటూ.

"అమ్మా! కిటికీ తుడువు. నాకేమి కనిపిస్తూలేదు!"

"పేచు తీస్తున్నప్పుడు యిల్లంతా దుబ్బ. నన్ను బయటకుతీసుకుపోవే అంటాను. నాకు తోడుగా వుండరా అంటుంది అమ్మ. అనుమాన మేమీలేదు— నేనంటే తనకు ప్రాణం! ఆమె పనిచేస్తూ పాడుతుంది, వేల పాటలొచ్చు తనకు."

పసివాడు ఓ పాట అందుకున్నాడు,

కాసేపు విని "బాగా లే"దన్నా నేను.

"ఈ పాటలన్నీ యింతే." ఉన్నట్టుండి మళ్ళా అన్నాడు; "అదిగో విను! ఆ పాట! నన్ను పైకెత్తవా? తొందరగా."

ఆ పసివాన్ని ఎత్తి కిటికిలో కూచోపెట్టాను. బయట ఓ పిల్లవాడు సంగీతం వినిపిస్తున్నాడు— తడవకో పాట. ఓ కుక్క అరుస్తున్నది. లయెంకా వింటూ తనూ మెల్లగా పాడుతున్నాడు.

ఇంటి నిండా ధూళి,

సంగీతం ఆగిపోయింది,

"నన్ను కిందికి దించు. ఎవరో వాణ్ణి తరిమేసారు."

నేను పెట్టెలోకి దించాను. చేతులతో రొమ్ము రుద్దుకుంటూ, మెల్లగా దగ్గుతూ, అన్నాడు: "మంచిగాలి చాలాసేపు పీలిస్తే నాకు మంచిదికాదు. నువు ఎన్నడైనా దెయ్యాలు చూసావా?"

"లేదు"

"నేనూ చూడలే. స్టవ్‌కింద రాత్రుళ్ళ చూస్తుంటా. అవి రావు, శ్మశానాల్లో వుంటాయట కద?"

"వాటితో నీకేంపని ?"

"గమ్మత్తు. ఓ దెయ్యం మంచిదనుకో— ఎట్లా వుంటుంది ? నీళ్ళు మోసేవాని బిడ్డ కట్కా నేలమాళిగలో ఓ దెయ్యాన్ని చూసి జడుసుకుంది. భయపెట్టేవాటిని చూస్తే నాకేం భయం లేదు."

కాళ్ళ చుట్టూ గుడ్డపేలికలు కప్పుకొని మళ్ళీ అందుకున్నాడు :

"నిజానికి అవంటే నా కిష్టం. భయంకరమైన కలలన్నా యిష్టం. ఒకసారి కలలో ఓ చెట్టు చూసాను. దానివేళ్ళు పైకున్నాయి, ఆకులు భూమిలో. చెమటలుపట్టి వణికాను. ఓసారి అమ్మను చూసాను బట్టల్లేకుండా పడివుంది. ఆమె కడుపును ఓ కుక్క తింటున్నది. ఒక్కొక్క ముక్క కొరికి ఉమ్మివేస్తున్నది. ఓసారి మా ఇల్లు కదిలిపోయి వీధిలో ఎగురుతూపోయింది. ఓపిల్లి దానివెంట పరుగెత్తుతూవుంది."

తర్వాత ఏమేమో చెప్పాడు. నేను వింటున్నాను. మళ్ళా అన్నాడు;

"నాకే కాళ్ళుంటేనా... ఓ దుకాణం పెట్టుకుంటా. అమ్మకు ఒక యిల్లుకొంటా. బయట, ఎప్పుడైనా బయట తిరిగావా నువు ?"

"ఊఁ ఎందుకు ?"

"ఎలా వుంటుంది ? చెప్పు !"

పొలాలూ, గడ్డి భూముల గురించి చెప్తూ పోయాను. చాలా శ్రద్ధగా వింటున్నాడు, కనురెప్పలు వాలిపోయాయి. నోరు మెల్లగా తెరుచుకుంది. నిద్రపోతున్నట్టున్నాడు. ఇది చూసి, నేను కంఠం తగ్గించాను. వాళ్ళ అమ్మ వచ్చింది. మరుగుతున్న టీ, ఒక పేపర్‌బ్యాగ్, వోడ్కా సీసా తెచ్చింది.

"అమ్మా ! ఓ చేతిబండి తెచ్చి నన్ను బయటికితీసుకుపోవా ? బయట ఏముందో చూడకుండానే నేను చస్తానే. నువు పందివి—" బాధగా అరుస్తున్నాడు పసివాడు.

"తిట్టకు, ఇంకా చిన్నవానివి నువు."

"తిట్టకు అంటావు నిజమే. నువయితే కుక్కలా యిష్టం వచ్చినట్టు తిరుగుతావు అదృష్టవంతురాలివి" నావైపు తిరిగి, "దేవుడేనా ఆ మైదానం చేసింది?"

"అంతే అనుకుంటా"

"ఎందుకోసం"

"ప్రజలు దానిలో నడవాలని"

"మైదానంలోకి నా పెట్టెలన్నీ తీసుకుపోయి చిమ్మటలూ, సీతాకోకచిలుకలూ— అన్నింటినీ వదిలిపెడతా ధర్మశాలలో అవి దేవుణ్ణి చూస్తాయా?''

ఆమె నవ్వుతూ కీచుమని అరచింది. పడకమీద పడిపోయి కాళ్ళు తన్నుకుంటూ మొత్తుకుంటున్నది: "నన్నెవరైనా పైకి తీసుకుపోండి బిడ్డా!"

లయొంకా తల్లిని ప్రేమగా చూసి చిన్నగా నవ్వుతూ తిట్టుమాట ఏదో అన్నాడు.

"బాగా నవ్వుతుంది కదా?'' మరో తిట్టుమాట

"నవ్వుకోనీ''— నే నన్నాను:

"నాదేం పోయింది? నవ్వుకోనీ, కిటికీ తుడవక పోతేనే నాకు కోపం వస్తుంది. కిటికీ కడగమని బతిమిలాడుతారోజూ, నాకు వెలుగురావడం లేదు. తనెప్పుడూ మరిచిపోతుంది.

తనలో తాను నవ్వుకుంటూ నాకేసి కన్నుగీటి అన్నది: "నాబిడ్డ రత్నంకదా? నా బిడ్డకోసం కాకపోతే నేనెందుకు బతికున్నా? ఎప్పుడో ఉరిపోసుకొనో బావిలో దుమికో చచ్చిపోదును!" నవ్వుతూనే చెప్పింది ఆమె.

లయొంకా హఠాత్తుగా అడిగాడు: "నువు మూర్ఖునివా''

"నాకు తెలియదు. ఏం— ఎందుకని?''

"అమ్మ అంటుంది— నువు మూర్ఖునివని"

"అవును. ఎందుకో తెలుసా? చెడు ఉద్దేశ్యంతో అవలేదా మాట నేను తాగుబోతు స్త్రీని బజారు నుంచి తెచ్చి మంచాన పడేసి వుత్తినే పోతాడు ఆయన. నువు చాడీలు చెప్పేవానివయ్యావు!"

ఆమెకూడా చిన్న పిల్లలా మాట్లాడింది. చిన్నపిల్ల కళ్ళలా వున్నాయి. ముక్కు లేని ముఖమూ, పైకి లేచిన పెదవీ, బయటికి కనిపిస్తున్న పళ్ళూ— యివే వికారంగా వున్నాయి.

"టీ తాగుదాం" అన్నది.

"నేను పెద్దయ్యాక అమ్మ నాకో చేతిబండి ఇస్తుంది. వీధుల్లో పాకుతూపోయి భిక్ష ముడ్చుకుంటాను. మైదానాల్లోకి పోతాను." పసివాని కలలు.

"ఓహో!" ఆమె నవ్వుతూ అన్నది: ''మైదానం అంటే స్వర్గమనుకుంటున్నాడు వాడు! ఏమున్నాయక్కడ! క్యాంపులూ, సిగ్గులేని సైనికులూ, తాగుబోతులూ.''

"అదేం కాదు ఆయన్నడుగు ఆయన చూసాడు''

"నేనూ చూసా"

"తాగి వున్నప్పుడు"

పిల్లలా వాదనలోకి దిగారు.

సాయంత్ర మయింది. పసివాడు టీ తాగాడు. నన్నూ, వాళ్ళమ్మనూ చూసి అన్నాడు. "నేను నిద్రపోతా"

"పడుకో"– తల్లి అంది

"ఆయన పోతాడు. పోతావు కదూ?"

"నువేం బాధపడకు నేనతడ్ని పోనివ్వను", తన మోకాలుతో నన్ను మెల్లగా కొడుతూ అంది.

"పోకేం"– లయొంకా అన్నాడు. కళ్లు మూసుకొని తలవాల్చాడు ఉన్నట్టుండి లేచి అమ్మతో అంటున్నాడు కోపంగా: "ఎల్లయ్యా పుల్లయ్యా ఎవనెవనితోనో తిరిగే బదులు ఈయన్ను పెళ్లి చేసుకోరాదు? వాళ్ళు నిన్ను తంతుంటారు కదా! ఇతను మంచివాడు..."

"పడుకో" తలవొంచుకొని టీ తాగుతూ ఆమె అన్నది

"ఆయన డబ్బుగలవాడు కూడా"– పసివాడన్నాడు.

ఓ నిమిషం ఆమె మౌనంగా వున్నది. తర్వాత ఆ విశాలమైన పెదాలతో టీ చప్పరిస్తూ పాతమనిషితో మాట్లాడినట్టుగా నాతో చెప్పింది:

"ఇదిగో యిట్లా బతుకుతున్నాం– వాడూ, నేనూ. యింకెవరూ లేరు. నన్ను బయట తిడతారు. లంజె అంటారు. అయితేనేం? నేను సిగ్గువడేదేమీ లేదు. బయట నేను పనికి రాని సరుకును. నేనేం మంచో ఎవరైనా చూడొచ్చు. నిద్రపోయాడు వీడు. మంచి బిడ్డడు కదా?"

"అవును. చాలా మంచి పిల్లడు."

"తెలివైన వాడు కూడా కదా?"

"ఔను, తెలివైన బుర్ర."

"వాళ్ళ నాన్న ఓ పెద్దమనిషి. వాళ్ళకో ఆఫీసు వుండె. పేపర్లు రాస్తారు. ఏమంటారు వాళ్ళను?"

"నోటరీ?"

"ఆఁ! మంచివాడు. దయగలవాడు. నేనంటే ప్రేమ. వాళ్లింట్లో పనిచేసే దాన్ని నేను."

కొడుకు కాళ్ళమీద చిరుగులు కప్పింది. తలకింద నల్లని వస్తువేదో దిండు లాగా అమర్చింది. చాలా నిమ్మళంగా మళ్ళా చెప్పడం మొదలు పెట్టింది:

"హఠాత్తుగా ఆయన పోయాడు- ఓ రాత్రి. నేను అంతకు కొద్దిసేపటిముందే ఆయనను వదిలిపెట్టి పోయాను. నేలమీద పడిపోయాడు- అంతే- చచ్చిపడున్నాడు. నువు వ్యాపారం చేస్తున్నావటగదా? బీరు అమ్ముతున్నావా?"

"ఔను."

"నీ స్వంత వ్యాపారమా?"

"కాదు."

ఇంకా దగ్గరగా జరిగి అన్నది: "నన్ను చూసి అసహ్యించుకోకు, పడుచువాడా! నేనింకా అంటుకోను. బజారులో ఎవరినైనా అడుగు, అందరికీ తెలుసు."

"నేను అట్లా ఏమీ లేను."

మోటు వేళ్ళూ, తెగిన గోళ్ళూ గల తన చిన్న చేతిని నా మోకాలుమీద వుంచి యింకా యిట్లా చెప్పింది: "లయోంకా యివాళ చాలా ఆనందంగావున్నాడు. నీ వల్లనే. నీకెంతో రుణపడివున్నాను."

"నేను పోతానిక."

"ఎక్కడికి?" ఆశ్చర్యంగా అడిగింది.

"నా వ్యాపారం చూసుకోవాలి"

"ఇక్కడ వుండు!"

"వుండలేను"

తన కొడుకుకేసీ, తర్వాత కిటికీకేసీ, ఆకాశంలోకీ చూసి నెమ్మదిగా అన్నది: "ఎందుకుండలేవు? చేతి రుమాలుతో నా మొహం కప్పుకుంటాను. నా కొడుకు కోసమని మీకు కృతజ్ఞతలు చెప్పుకోవాలి. నా బతుకు మార్చుకుంటాను. ఏం?"

ఆమె ఎంతో సహజంగా మంచిమనసుతో మాట్లాడింది. వికారమైన ముఖంగల పసిపాప కళ్ళలాంటి ఆ కళ్ళు నవ్వినాయి. ఆ నవ్వు ఎవరో బిచ్చకత్తె నవ్వినట్టుగా లేదు. కృతజ్ఞత అనే అప్పును తీర్చుకోగల ధనికురాలి నవ్వులావుంది అది.

"అమ్మా!" పిల్లవాడు ఒక్కసారిగా అరిచాడు, లేచి కూచుంటూ "అమ్మా! అవి పాకుతున్నాయే!"

బిడ్డవైపు వాలి అన్నది ఆమె: "కలగంటున్నాడు"

నేను బయటకు వచ్చి నిలబడ్డాను ఆలోచనలో మునిగిపోయాను. తెరిచిన కిటికీ నుంచి బిగ్గరగా ఓ పాట వినిపిస్తోంది: జోలపాట:

"భయంకరంగా ప్రాకుతూ వచ్చాయి అవి మళ్లీ
బాధా, దుఃఖమూ వెంట తెచ్చాయి
లెక్కలేనన్ని కష్టాలు
హృదయాన్ని ముక్కలు చేస్తున్నాయి
అయ్యో! అయ్యో!
ఎక్కడికి పారిపోదాం?"

బలంగా వస్తున్న దుఃఖాన్ని అణచిపెట్టడానికి పళ్లు బిగపట్టి తొందర తొందరగా నేను వెళ్ళిపోయాను దూరంగా. (1917)

(ఆంగ్లంనుంచి స్వేచ్ఛానువాదం)

## మానవ జాతి వికాసానికి తోడ్పడిన

# లెనిన్ గోర్కీల స్నేహం

వ్లాదిమిర్ స్చేర్‌బినా

నూతన సామ్యవాద సాహిత్యానికి వెనుకనున్న పాత సాంప్రదాయాన్ని చక్కగా విశ్లేషించడమే కాకుండా, ప్రజా విముక్తి పోరాటం ద్వారా, సామ్యవాద భావాల వ్యాప్తి ద్వారా సాహిత్యంలో ప్రవేశించిన కొత్త అంశాలను కూడా అక్టోబర్ విప్లవ విజయానికి చాలా ముందుగానే లెనిన్ నిర్వచించాడు.

అభ్యుదయ రచయితల కృషి యొక్క జనసమ్మతమైన స్వభావాన్ని చూపడమే కాదు- ప్రజా జీవితంతో ప్రతి కళాకారునికి వుండే సంబంధపు ప్రత్యేకతను బయలు పరచి, కళాకారుని కళలో ఆ జీవితం ఎట్లా ప్రతిబింబించిందో కూడా లెనిన్ స్పష్టం చేసాడు. విప్లవభావాలుండీ అణచబడ్డ బానిసలు బెలిన్‌స్కీ మరియు చెర్నిశెవ్‌స్కీల ద్వారా మాట్లాడగా, పూర్వకాలపు రైతాంగ ప్రయోజనాలను టాల్‌స్టాయ్ ప్రతిబింబించగా, విప్లవోన్ముఖులైన శ్రమజీవులు చరిత్ర రంగంలోకి ప్రవేశించిన సమయంలో గోర్కీ ఉదయించాడు. రష్యన్ ప్రజలకూ వారి అగ్రగామిదళంవారైన శ్రమజీవులకూ గోర్కీ అంకితమైపోయాడు.

ఇరవయవ శతాబ్దపు సాహిత్య చరిత్రలో ప్రత్యేకంగా చెప్పుకోతగిన విషయం- లెనిన్, గోర్కీల విషయమే. మన కాలానికిచెందిన ఈ ఇద్దరు మహనీయుల వ్యక్తిగత స్నేహం ఎంత దగ్గరిదో అందరికీ తెలిసిందే. కాని- మానవ సాంఘిక జీవన రంగంలో మహోన్నతులైన వ్యక్తులుగా వీరు చేసిన కృషి యొక్క చారిత్రక ఉద్దేశాన్నీ, ప్రాధాన్యతనూ చాలా లోతుగా అర్థంచేసుకోవడం ద్వారా మాత్రమే వీళ్ళిద్దరి యొక్క స్నేహమూ మరియు ఉత్తర ప్రత్యుత్తరాలకున్న పూర్తి ప్రాధాన్యత అవగతమవుతుంది.

మేలుకొంటున్న శ్రమజీవుల నుంచి ఒక గొప్ప సాహితీవేత్తగా ఉన్నతస్థితి నందుకున్న గోర్కీ కృషిపట్ల లెనిన్‌కున్న ప్రేమా కుతూహలమూ చాలాముఖ్యమైనవి. గోర్కీ తొలి రచనలతో ఏర్పడ్డ మొదటి పరిచయం మొదలుకొని ఆయన జీవితాంతం లెనిన్ గోర్కీ భవిష్యత్తు గురించి ఎంతో శ్రద్ధ కనబరచాడు. ఈ వైపుగా ఆయన మొట్టమొదట చేసిన పని- గోర్కీ యొక్క కళాత్మక స్వభావాన్నీ ప్రాధాన్యతనూ పూర్తిగా కొత్తదైన ఒక పద్ధతిలో చాలా ఖచ్చితంగా విలువకట్టడం; తిరోగమన

శక్తుల దాడులన్నింటి నుంచి అతన్ని కాపాడుతూ, అతని శక్తివంతమైన ప్రతిభ సరియైన మార్గంలో ఎదగడానికి చాలా పట్టుదలతో తోడ్పడడం. గోర్కీని ఒక గొప్ప ప్రజా రచయితగా గుర్తించి, ఉద్ధృతమౌతూన్న సామ్యవాద విప్లవంతోనూ పార్టీ కార్యకలాపాలతోనూ గోర్కీ కృషికిగల అధికమైన సంబంధాన్ని మొదటిసారిగా గుర్తించినవాడు లెనిన్.

గోర్కీ, లెనిన్ లమధ్యనున్న సంబంధాల గురించి కృపస్కయా యిట్లా రాసింది: "రచయితగా గోర్కీ అంటే లెనిన్‌కు చాలా గౌరవం. ముఖ్యంగా 'అమ్మ' నవలా. 'నోవయా జిజ్‌న్'లో ఫిలిస్టినిజమ్[1] (దేని అన్నిరకాలనైతే లెనిన్ అసహ్యించుకున్నాడో) గురించి గోర్కీ రాసిన రచనలు లెనిన్‌కు ప్రత్యేకంగా యిష్టం. అథోజగత్తులు, 'ఫాల్కన్ పాట', 'తుఫానుపక్షిపాట', యింకా 'బురదలో స్త్రీ' 'ఇరవైఆరుగురు పురుషులూ - ఒక అమ్మాయి' కథలూ ఆయన కిష్టం... కళాభవనానికి పోయి గోర్కీ 'అథోజగత్తులు' చూడడమంటే ఆయనకు చాలా యిష్టం. లెనిన్ తన చివరి రోజుల్లో గోర్కీ రాసిన "నా బాల్యసేవ" వినడమంటే ఎంతగా చెవికోసుకునేవాడో!... లెనిన్‌కు ప్రీతిపాత్రులైన పేద ప్రజలూ, శ్రమజీవుల గురించి ముఖ్యంగా గోర్కీ రాసాడు; పీడన, దోపిడి, చైతన్యరాహిత్యం, భావదాస్యం— వీటిని అసహ్యించుకునే మనిషి కళ్ళలోంచీ, ఒక విప్లవకారుని కళ్ళలోంచీ— గోర్కీ— నిజమైన జీవితాన్ని ఉన్నదున్నట్టుగా చిత్రించాడు. గోర్కీ రాసిందంతా లెనిన్ హృదయానికి దగ్గరైనదే."

సాహితీరంగంలో సత్యమూ కళానైపుణ్యమూ సామ్యవాద వస్తువుతో కలిసి వుండాలని లెనిన్ తీవ్రంగా కృషిచేసాడు. ప్రజా జీవితంతో వేరుపరచలేని అభ్యుదయ సాహిత్యాన్ని ఆయన గోర్కీ రచనల్లో కనుగొన్నాడు.

రచయితగా గోర్కీ నిలవడమూ, అతని రచనల సృజనాత్మక స్వభావమూ అనేవి— పందొమ్మిదవ శతాబ్ది చివరా, ఇరవయవ శతాబ్ది మొదటా జరిగిన సమగ్ర చారిత్రిక, సాహిత్య క్రమంలో చూడవలసి ఉంటుంది. కాని— ఈనాటివరకూ గోర్కీపై రాయబడ్డ రచనల్లో ఆ కాలపు సాహిత్య పరిణామం గురించి ఏకపక్ష వివరణలు లేకపోలేదు. ఆనాటికి రష్యన్ సాహిత్యంలో విమర్శనాత్మక యథార్థ వాదం క్షీణదశలో వుండి, స్వభావవాదమూ, క్షీణవాదమూ రాజ్యం చేస్తుండేవని చాలా మంది పరిశోధకుల అభిప్రాయం. ఈ పూర్వరంగంతో గోర్కీ సాహిత్యాన్ని చూడడం ఈ

1. సంస్కృతితో సంబంధంలేని పదార్థవాదం.

సాహిత్యాన్ని చిన్నచూపు చూడడమే. సాహిత్యంయొక్క నిజమైన స్థితికీ ఈ అభిప్రాయానికీ పొంతన లేదు. అంతేకాదు— ఇది—ఆనాటి రష్యన్ సాహిత్యం ప్రపంచంలోనే చారిత్రిక ప్రాధాన్యత పొందిందనీ, మానవ కళావికాసంలో టాల్‌స్టాయ్ కొత్త బాట చూపాడనీ— లెనిన్ చేసిన ప్రతిపాదనకు విరుద్ధమైనట్టిది కూడా.

విముక్తి పోరాటపు మూడవ (శ్రామిక) దశలో గోర్కీ సృజనాత్మక కళ పరిపక్వం చెందింది. ఇదే సమయంలో రష్యా ప్రజల విప్లవ పోరాటం ఉన్నత శిఖరాలను అందుకున్నది— ప్రజలే పాల్గొన్న పోరాట కాలం యిది. కొత్త సామ్యవాద శకపు పుట్టుక గురించి రచయిత తన రచనల్లో ప్రతిబింబించాడు.

అభివృద్ధి నిరోధక విమర్శకులు గోర్కీ రచనల వుద్దేశాన్ని చాలా మూర్ఖంగా వక్రీకరించి చూపిస్తున్నారు. "గొప్పచేసి చెప్పే మోసా"న్ని ఉపశమన వాదాన్ని అరాజకత్వాన్నీ బలపరిచేవానిగా గోర్కీని చూపడానికి వీరు ప్రయత్నిస్తున్నారు. గోర్కీ ప్రజలకు ఎంత దగ్గరివాడో, అతని రచనలు ఎంత విప్లవకరమైనవో చూపుతూ లెనిన్ గోర్కీకి మద్దతు నిచ్చాడు.

గోర్కీ గురించి లెనిన్ చెప్పిన మాటలన్నీ— విప్లవం కోసమూ, దేశ సామ్యవాద పరిణామం కోసమూ తన ప్రతిభనంతా వినియోగించిన, కొత్త తరహాకు చెందిన ఒక గొప్ప విప్లవ రచయిత యొక్క రూపాన్ని చిత్రిస్తాయి.

రచయితగా గోర్కీ గడిపిన జీవితంలోని చాలా భాగం 'ఇస్క్రా' పత్రికతో ముడిపడి వున్నది. ఈ పత్రికను 1900లో లెనిన్ ప్రారంభించాడు. యాకుటో విచ్ కవాతో మాట్లాడుతూ ఇస్క్రాను బలపరచేవానిగా 1901లో గోర్కీ ప్రకటించుకున్నాడు. నిరంకుశత్వానికి వ్యతిరేకంగా పోరాడే విషయంలోనూ, ప్రజల హక్కులను పరిరక్షించే విషయంలోనూ ఏకీభావన కుదరడం 'ఇస్క్రా'తో గోర్కీ సంబంధాన్ని దృఢపరచింది.

'ఇస్క్రా'ను నడుపుతూ లెనిన్ గోర్కీని ప్రోత్సహించాడు. గోర్కీ ఎప్పుడూ రాసే 'జీజన్' పత్రికను జారిస్టు పోలీసులు నిషేధించడం గురించి 1901 'ఇస్క్రా' నాలుగవ సంచికలో ఉన్నది. నిజ్‌నీ—నొవ్‌గొరొడ్ నుంచి ప్రఖ్యాత రచయిత గోర్కీని ప్రజాపీడక జారిస్టు ప్రభుత్వం బహిష్కరించడాన్ని లెనిన్ ఖండించాడు. మరుసటి సంవత్సరం— విద్యార్థులూ, రైతులూ, రచయితలూ, మతావలంబకులను అవమానాలకు గురిచేస్తూ వచ్చిన 'చీకటి శక్తి'గా ఆనాటి నిరంకుశత్వాన్ని లెనిన్

బట్టబయలు చేశాడు, ఎకాడెమీ ఆఫ్ సైన్సెస్ నుంచి గోర్కీని వేరు చేసిన వాళ్ళను "పిరికి సన్నాసులు"గా ఎగతాళి చేసి, అతనిని నిరంకుశత్వానికి ఎదురు నిలిచి పోరాడినవానిగా లెనిన్ "ఇస్క్రా" పేర్కొన్నది.

సృజనాత్మక శక్తిని గుర్తిస్తున్న పేద ప్రజల వాణిగా మాక్సిమ్‌గోర్కీ ప్రపంచంలో కళావికాసానికి కొత్త బాటలు వేసి, సామ్యవాద వాస్తవికతను కనుగొన్నాడు గోర్కీ రచనల వుద్దేశాన్ని వక్రీకరించి వాటి ప్రాధాన్యతను తక్కువచేసి చూపడం కోసం ఈనాడు అభివృద్ధి నిరోధక భావవాదులు చేస్తున్న ప్రయత్నాల నెదిరించడంలో మనకు గోర్కీ గురించిన లెనిన్ ఆనాటి అధ్యయనం తోడ్పడుతున్నది. సోవియట్ సాహిత్యమంటే పడనివాళ్లు గోర్కీకి సామ్యవాద విప్లవంతో సంబంధమే లేదని నిరూపించడానికి ప్రయత్నిస్తున్నారు. ఉదాహరణకు: గోర్కీ సామ్యవాద వాస్తవికతను ముందుగా కనుగొన్నవాడు కాదనీ "19వ శతాబ్ది రష్యన్ వాస్తవికవాద చరిత్రలో అంతిమ అధ్యాయ"మనీ 1957 లో అమెరికాలో వెలువడ్డ 'సోవియట్ సాహిత్య నిఘంటు'వులో రాసారు. ఇవన్నీ వాస్తవికతకూ చారిత్రక సత్యానికీ విరుద్ధంగా చెప్పిన విషయాలు.

ఆనాటి విప్లవ శక్తులను, భావాలను కళాత్మకంగా ప్రతిబింబించిన సాహిత్యంగా గోర్కీ రచనలను అర్థం చేసుకున్నాడు లెనిన్.

కథలూ, నవలలూ, విమర్శలద్వారా గోర్కీ అనేక విషయాలలో చూపిన అసాధారణ ప్రతిభను లెనిన్ ఎప్పుడూ మెచ్చుకునేవాడు. లెనిన్ రచనలకూ, ఉపన్యాసాలకూ సన్నిహితంగావున్న గోర్కీ రచనలు, ఆనాటి విప్లవ పోరాటానికి ప్రతిరూపంగా నిలిచాయి. విముక్తి పోరాట కాల్పనికతను ప్రతిబింబిస్తూ విప్లవ ఝంఝను ముందే గుర్తించి చెప్పిన గోర్కీ ఫాల్కన్ తుఫానులాంటి, రూపకాల బ్రహ్మాండమైన శక్తిని లెనిన్ గుర్తించాడు. "తుఫానుకు ముందు" అనే రచనలో లెనిన్ యిట్లా రాసాడు: "శ్రమజీవులు పోరాటానికి సిద్ధపడుతున్నారు. తుఫానును ఎదుర్కొన చాలా ధైర్యంగా, కలిసి కట్టుగా యుద్ధరంగంలో దుముకడానికి కుతూహలంగా వున్నారు."

గోర్కీ మొదటి రచనలు అచ్చుకాగానే, ఆయన కాల్పనికత గురించి చర్చ మొదలైంది. నరోదనిస్టు మరియు ఉదారవాద విమర్శకులు గోర్కీకి వ్యతిరేకంగా ఒక ఉద్యమం లేవదీసారు. ఆయన కాల్పనికత గురించి సాధారణ జీవితాన్ని వ్యతిరేకించేది అనీ, అందువల్ల ఆయన క్షీణవాది అనీ ఎన్. మిఖయిలొవ్‌స్కీ మొట్టమొదటి సారిగా పేర్కొన్నాడు. దీని ఆధారంగానే గోర్కీ అసలు విషయాలను వదిలేసి

చాలా విచిత్రంగా దేశదిమ్మరులను చిత్రించడమే పనిగా పెట్టుకున్నాడని- అంటున్నారు. రష్యన్ సాహిత్యంలోని వాస్తవవాదాన్ని కొనసాగించి అభివృద్ధి చేసి నిజమైన జీవితాన్ని చిత్రించిన వానిగా గోర్కీనిగుర్తిస్తూ లేరు.

గోర్కీ కాల్పనికత చాలా క్లిష్టమైనది. కొన్నిసార్లు గోర్కీ వాస్తవాన్ని విడిచి, కల్పననే ముందుకు తీసుకుపోయాడు. "వాస్తవవాద అభివృద్ధి కాముకులు" గోర్కీయొక్క కొన్ని తప్పుడుప్రకటనలను పట్టుకున్నారు. ఉదాహరణకు 1918-19లో "క్లిష్టమైన ప్రశ్న" అనే రచనలో గోర్కీ ఆదర్శనాయకుల సృష్టి గురించి ఊహించాడు. ఆనాటి రాజకీయ పరిస్థితిని ఆయన విచిత్రంగా అర్థం చేసుకుని దానికనుగుణంగా ఊహించాడు. కళలో వైవిధ్యాన్ని ఆశించిన లెనిన్ గోర్కీ ఈ ఆలోచనల్ని వ్యతిరేకించాడు. అయితే గోర్కీ వాస్తవ వాదనకు అనుగుణంగా కూడా అనేక రచనలు చేసాడు.

కాల్పనికవాదంలో పడి యధార్థాన్ని విస్మరించాడనేది తప్పని గోర్కీని సమగ్రంగా అధ్యయనం చేస్తే తెలుస్తుంది. కాల్పనికవాదాన్నీ, రచయితకుండే పరిశీలనా అధికారాన్ని, ఊహను, కల్పననూ నిరాకరించే ఈ ఏకపక్ష ధోరణులు వాస్తవం వున్నచోట స్వభావవాదాన్ని కూచోపెట్టి, సాహిత్యాన్ని చప్పగాను కాంతిహీనంగాను చేసేస్తాయి.

సామాజిక ప్రజాస్వామ్య పోరాటంలో గోర్కీ కలిసిపోయాడు. ఇక్కడ లెనిన్ గోర్కీకి దారి చూపాడు. శతాబ్ది మారగానే పార్టీకి, విప్లవ సాహిత్యానికీ దగ్గరగా గోర్కీని తేను, లెనిన్ ప్రయత్నించాడు. 1902లో 'ఇస్క్రా' ప్రతినిధితో జరిగిన చర్చ ఫలితంగా బోల్షెవిక్ విప్లవకారులకు గోర్కీ చేరువయ్యాడు

నిజనీ-నొవ్‌గొరొడ్ 'ఇస్క్రా' సంస్థ అజ్ఞాత కార్యకలాపాలతో గోర్కీకి సంబంధం వున్నది. పావలొవ్, జలొమొవ్, ప్యాతిబ్రతోవ్, తదితర సొర్‌మొవొ విప్లవ శ్రామికులతో ఆయనకు దగ్గరి స్నేహం ఏర్పడ్డది. తన "అమ్మ" కథకు కావలసిన ప్రాథమిక వస్తువును అందించి బోల్షవిక్ పార్టీతో సంబంధాన్ని ఏర్పరచింది ఈ స్నేహమే. శక్తివంతమైన ఒక కొత్త విప్లవపార్టీ ఏర్పడాలని లెనిన్ నాయకత్వంలో 1903లో నిర్ణయం చేయబడింది. అప్పుడే బోల్షెవిక్‌లకు తాను అంకితమైపోయినట్టు గోర్కీ (1928లో) రాసాడు. 25 సంవత్సరాలు బోల్షవిక్‌ల ఆస్తిగా తానున్నట్టు కూడా తెలిపాడు.

1903 ఆఖరాలు కాలంలో 'ఇస్క్రా' మెన్‌షెవిక్‌ల ఆధీనంలోకి పోయినప్పుడు లెనిన్ దానినుంచి వేరై, 1905లో కొత్త బొల్షెవిక్ పత్రిక 'పెర్‌యొడ్' నాయకత్వం

చేపట్టాడు. గోర్కీ ఈ పత్రిక ప్రచురణలో తోడ్పడడాన్ని శ్లాఘిస్తూ లెనిన్ రాసిన వుత్తరం ద్వారా పార్టీ కార్యకలాపా లన్నింటా గోర్కీ చూపుతున్న శ్రద్ధను లెనిన్ ఎంతో మెలుకువగా గమనిస్తున్నట్టు తెలుస్తున్నది. 1905 జనవరి 9నాటి సంఘటనల తర్వాత పీటర్, పాల్ దుర్గంలో జారిస్టు ప్రభుత్వం గోర్కీని బంధించి నప్పుడు గోర్కీని సమర్థిస్తూ, నిరంకుశత్వాన్ని దుయ్యబడుతూ లెనిన్ 'పెర్‌యాడ్'లో రాసాడు'

మొట్టమొదటి రష్యన్ విప్లవకాలంలో బోల్షెవిక్ పార్టీ అధికార పత్రిక 'నొవయ జిజ్న్' వెలువడడంలో గోర్కీ చాలా కృషిచేసాడు. తొమ్మిదవ సంచిక నుంచి దీనికి లెనిన్ ముఖ్య సంపాదకుడు. 1905 నవంబర్ 27న ఈ పత్రిక పనికి సంబంధించిన ఒక సమావేశంలోనే మొట్టమొదటిసారిగా లెనిన్ గోర్కీ కలుసుకున్నారు.

బూర్జువా మేధావుల సిద్ధాంతాలనూ, పెట్టుబడిదారీ సమాజంలోని పాలకవర్గ ప్రతినిధుల ఆధ్యాత్మిక మురికి ప్రపంచాన్నీ ఎదుర్కొన్న 'ఫిలిస్టినిజమ్‌పై వ్యాఖ్యానం. అనే గోర్కీ రచనను లెనిన్ చాలా మెచ్చుకున్నాడు. సంపాదకీయంగా ఈ వ్యాఖ్యానాన్ని ఖండించినప్పుడు గోర్కీని సమర్థించడానికి లెనిన్ ముందుకువచ్చాడు. బూర్జువా వ్యక్తివాదం మీద గట్టి దెబ్బతీసిన ఈ వ్యాఖ్యానం లెనిన్ ఆలోచనలకు అనుకూలంగా వున్నట్టిది.

లండన్‌లో జరిగిన అయిదవ పార్టీ కాంగ్రెస్‌కు హాజరు కావడం గోర్కీ జీవితంలో ఒక ముఖ్యమైన ఘటన, తిరిగి వచ్చిన తర్వాత ఒక వుత్తరంలో యిట్లా రాసాడు; "ఈ కాంగ్రెస్ నాకు చాలా లాభం చేసింది. అస్పష్టంగా వున్న ఎన్నో విషయాలు నాకు స్పష్టంగా తెలిసాయి. మెన్షెవిజం అంటే ఏమిటో బాగా అర్థమైంది." ఈ కాంగ్రెస్‌లోను, ఆ సాంఘిక ప్రజాస్వామ్య సంఘం కార్యకలాపాల్లోను పాల్గొనడం ద్వారా గోర్కీ లెనిన్‌కు యింకా చాలా దగ్గరై, పార్టీని తన ఇల్లు అనుకునే వరకు వచ్చాడు. గోర్కీ రాసిన 'అమ్మ' గురించి గోర్కీతో కాంగ్రెస్‌లో లెనిన్ చెప్పిన మాటలు ఈ సందర్భంలో గమనించదగ్గవి; "ఇది చాలా అవసరమైన పుస్తకం. తమకు తెలియకుండానే, ఆయత్నకృతంగా ఎందరో శ్రామికులు విప్లవంలో పాల్గొన్నారు. ఇప్పుడు వాళ్ళు 'అమ్మ'ను చదివి ఎంతో లాభం పొందుతారు." వికాసం పొందిన సామ్యవాద సిద్ధాంతాన్ని శ్రామికవర్గ పోరాటంతో జోడించిన చారిత్రక క్రమాన్ని ప్రతిబింబించిన ఈ విశిష్ట రచన ప్రాధాన్యత ఎంతటిదో లెనిన్ చెప్పాడు.

"సరియైన సమయంలో" ప్రచురింపబడ్డ పుస్తకంగా 'అమ్మ'ను లెనిన్ గుర్తించ చడం యింకొక విధంగా కూడా ముఖ్యమైన విషయం. ఈ గుర్తింపువల్ల గోర్కీ "అమ్మ" నవలలోని విషయాన్ని ఇంకా స్పష్టంగా నిర్వచించగలిగాడు. విప్లవకారు లకు స్పష్టమైన చారిత్రక గుణాలను ఆపాదించి వాస్తవానికి దగ్గరిగా ఆ పాత్రలను తీర్చి దిద్దాడు గోర్కీ. సామ్యవాదాన్ని మతంతో పోల్చిన అనవసర విషయాలన్నింటినీ కథనుంచి తొలగించాడు.

ధైర్యశాలియై జాగృతుడైన శ్రామిక విప్లవకారుడు అనాడు కొత్త నాయకుడు. ఈతని సజీవ చిత్రాన్ని గీచి ప్రపంచ సాహిత్యాన్ని సుసంపన్నం చేసింది "అమ్మ."

విప్లవ శక్తుల విజయం పట్ల లెనిన్‌కున్న అచంచల విశ్వాసంమీద సామ్యవాద సాహిత్యం ఆధారపడి ఎదిగింది. బంగారు భవిష్యత్తును ఆశించడం ఎంత కాల్పనికమో అంత నిజం: పోరాటమార్గాన పోతున్న శ్రామికుల గురించి నొకొలాయ్ ఇట్లా అన్నాడు: "ఘనులైన ప్రజలు!...నేర్చుకోవడంలో ఎంత ఇష్టం, పట్టుదల, కుతూహలం వాళ్లకు! వాళ్ళను చూస్తే– ఎన్నడో ఒకనాడు రష్యా ఈ ప్రపంచంలో గొప్ప ప్రజాస్వామిక దేశంగా నిలబడుతుందని చెప్పకుండా వుండలేము."

"ప్రొలిటరీ" బోల్షెవిక్‌ల ముఖ్య పత్రిక అయినపుడు దాని నిర్వహణలో కూడా గోర్కీ ప్రముఖ పాత్ర వహించాడు. గోర్కీ ఈ పత్రికలో చేసిన ఒక రచనను లెనిన్ విమర్శిస్తూ రచయిత ఒక వక్ర మార్గాన్ని అనుసరించాడని అన్నాడు. ఈ విష యం ద్వారా గోర్కీ రచనా విధానం పట్ల లెనిన్ ఎంత శ్రద్ధ చూపుతుండేవాడో తెలు స్తుంది. గోర్కీ రచనలో చాలా భాగం బొగ్డనొవ్ సిద్ధాంతంతో సంబంధంలేకుండా వున్నదని కూడా లెనిన్ చెప్పాడు. గోర్కీని విమర్శించడంలో లెనిన్ గోర్కీని ప్రజ లకూ, పార్టీకి అంకితమైన ఒక రచయితగా చూసాడు.

శ్రామికవర్గ పక్షపాతంతో రచనలుచేసే గొప్ప రచయితను గోర్కీలో లెనిన్ చూసాడు. లెనిన్ ఆశయమైన స్వేచ్ఛాసాహిత్యాన్ని గొప్ప కళాత్మక శక్తితో గోర్కీ తన రచనల ద్వారా బయలుపరచాడు. కమ్యూనిస్టు పార్టీ, లెనిన్ తనను కళా రంగంలో నడిపిస్తున్న శక్తులని గోర్కీ చాలాసార్లు చెప్పుకున్నాడు. 1909 చివరలో ఎ. ఆమ్‌ఫిట్‌థ్రొవ్‌కు ఒక వుత్తరంలో యిట్లా రాసాడు: "సోషలిజంలాగానే బోల్షె విజం నాకు చాలా ప్రీతిపాత్రమైనది... దీని ద్వారానే మనిషి తన వ్యక్తిత్వపు ఔన్న త్యాన్ని తొందరగా తెలుసుకొనగలుగుతాడు. నాకు వేరేమార్గం కనబడుతూ లేదు.

ప్రపంచంలోకి మనల తీసుకుపోయే బాట యిదే. మిగతా మార్గాలన్నీ ఈ ప్రపంచం నుండి మనల దూరంగా తీసుకుపోయేవి." ఆ తర్వాత కూడా చాలాసార్లు- కమ్యూనిస్టు పార్టీతో తను వేరుగా వుండలేనని ప్రకటించుకున్నాడు.

"ఈ యుగపు మేధస్సు, గౌరవము, ఆత్మ" అయినట్టి కమ్యూనిస్టు పార్టీతో సంబంధం పెట్టుకున్నాడు కాబట్టే గోర్కీ- సోవియట్ సాహిత్యంలో మొట్ట మొదటి రచయితగా నిలబడ్డాడు.

గోర్కీకి లెనిన్ రాసిన వుత్తరాలద్వారా గోర్కీకి పార్టీతో గల సంబంధం ఎంత దగ్గరిదో తెలుస్తుంది. కళాస్వభావానికి విరుద్ధమై, పార్టీ దృక్పథం కళాకారుని సృజనాత్మక వ్యక్తిత్వాన్ని కప్పిపెడుతుందని ఈనాడు అంతర్జాతీయ అభివృద్ధి నిరోధకులు వాదిస్తున్నారు. ప్రజలకు సేవచేయడమనే పంథా ద్వారా, పార్టీకి కట్టుబడి కళారంగంలో అమోఘమైన పాత్ర నిర్వహించగలగడానికి మాగ్జిమ్ గోర్కీ- మంచి దృష్టాంతం.

పార్టీనుంచి "గోర్కీ- బహిష్కరణ అనే అసత్యపు బూర్జువా పత్రికల కట్టుకథ" గురించి 'ప్రొలిటరీ'లో లెనిన్ యిట్లా రాసాడు: "వాళ్ళ శ్రమ వృథా. తన గొప్ప రచనలద్వారా కామ్రేడ్ గోర్కీ- రష్యన్ శ్రామికపోరాటానికీ, ప్రపంచ ప్రజాపోరాటాలకూ అంకితమైనవాడు."

పార్టీతో గల సంబంధం వలన గోర్కీ- జీవితం గురించి, చారిత్రక పరిణామం గురించి సరియైన అవగాహన ఏర్పరచుకోగలిగాడు. విప్లవకర మార్గంలో వాస్తవికత ఎట్లా పని చేస్తున్నదీ, పాతపై కొత్త ఎట్లా పోరాడుతున్నదీ- గోర్కీ పార్టీ ద్వారా, లెనిన్ ద్వారా-క్రమక్రమంగా తెలుసుకోగలిగాడు. ప్రజాజీవితం పరిశీలించడానికీ, జారిజం మీద కొత్త శక్తితో దెబ్బతీసేందుకు ప్రయత్నించడానికీ- "రష్యా అంతా విస్తృతంగా తిరగ" మని 1913 లోనే గోర్కీకి లెనిన్ సిఫారసు చేసాడు.

గోర్కీ కృషి వల్ల సాహిత్యంలో కొత్త వస్తువూ, సమస్యలూ పుట్టుకొచ్చాయి: విప్లవ శక్తుల జననం, సాధారణ ప్రజలను ప్రపంచాన్నే మార్చివేసే సర్వసత్తాక నాయకులుగా మార్చడం, ఒక కొత్త మనిషికి రూపకల్పన చేయడం, సామ్యవాదం వైపుగా సంఘం సాగి పోవడం.

సామ్యవాద విప్లవ నాయకునికీ, విప్లవకాలపు ప్రముఖ రచయితకూ మధ్యగల సంబంధాన్ని ఒకరు మరొకరికి చదువు నేర్పడంగా దిగజార్చడం తప్పు. మార్క్సిస్టు సామ్యవాద సిద్ధాంతమే చారిత్రకంగా ఒక క్లిష్టమైన క్రమం: దీనిలో పెద్దపెద్ద పార్టీ

నాయకులే తప్పటడుగులు వేయడం సహజం. గోర్కీ విషయంలో ఇది యింకా క్లిష్ట మైంది. ఎందుకంటే- దీనితో కళాత్మకదృష్టి మరియు రచయిత వ్యక్తిత్వం ముడిపడి వున్నాయి రచయితల విచిత్రమైన మనోప్రవృత్తిని లెనిన్ బాగా అర్థంచేసుకున్నట్టు గోర్కీ పట్ల ఆయన ప్రవర్తన తెలియజేస్తుంది. అందుకే వీళ్ళిద్దరి మధ్య సాగిన వుత్తరప్రత్యుత్తరాల్లో అధికారస్వరం కాకుండా; జీవితమూ, సిద్ధాంతమూ, కళలకు సంబం ధించిన సమస్యలపై స్నేహపూరిత సంభాషణ మనకు కనిపిస్తుంది.

గోర్కీ చేసిన పొరపాట్ల నుండి- లెనిన్- విప్లవదృక్పథం అలవరచుకోవడంలో రచయితలకు ఎదురయ్యే సమస్యలను గుర్తించి, తానెంతో నేర్చుకోగలిగాడు. గోర్కీ చేసిన తప్పులను సవరించి- లెనిన్- ఈ గొప్ప ప్రజారచయిత మాటలు యింకా శక్తివం తంగా తయారయేలా ప్రయత్నం చేసాడు.

"పశ్చాత్తాపం" అనే కథలో విప్లవ భావాలను దైవిక భావాలతో కలిపి గోర్కీ దైవత్వాన్ని ప్రతిబింబించి, తద్వారా 'కొత్త' మతం ఒకదాన్ని ప్రతిపాదించినట్టుగా వున్నది. "దేవున్ని చేరడమనేది- దేవున్ని సృష్టించడమూ, దేవున్ని నెలకొల్పడమూ, దేవున్ని ప్రతిష్టించడమూ వంటి వాటితో వేరనేది- పసుపుపచ్చ దెయ్యం వేరూ, నీలపు రంగుదెయ్యం వేరూ అనడం"- అని లెనిన్ ఈ కథను విమర్శించాడు. తర్వాతి కాలంలో లెనిన్ మాచిస్ట్-బోగ్డనొవిస్టు ఆదర్శ వాదంతో సలిపిన పోరాటానికీ, గోర్కీకి దేవుడిమీద ఏర్పడ్డ భ్రమలను విమర్శించడానికీ సంబంధం వున్నది. అతని భ్రమలను తెలియపరచి, కొత్త సామ్యవాద సమాజంలో మనిషి ఎట్లా దేవుని స్థానాన్ని అక్రమించి వ్యక్తిగత వాదం నుంచి సామాజిక స్పృహకు ఎదుగుతాడో లెనిన్ గోర్కీకి విశదీకరించాడు. గోర్కీ రచనల్లోని మూలధాతువుకు దైవిక భావన ఎట్లా సంబంధమే లేకుండా వున్నదో లెనిన్ తెలియజేసాడు.

గోర్కీ లెనిన్ సలహాలను శ్రద్ధగా వినేవాడు. "పశ్చాత్తాపం" కథను మెన్షె విక్ లూ, కాడెట్లూ మెచ్చుకోవడాన్ని గోర్కీ తిరస్కరించాడు. తన ఈ కథను అభి వృద్ధి నిరోధకమైనదిగా తర్వాత తెలుసుకున్నాడు, ఈ కథలోని లోపాలను "ఎండా కాలం" అనే కథ ద్వారా ఎత్తి చూపాడు. జాగృతమైన గ్రామీణ ప్రజానీకాన్ని గోర్కీ ఈ కథలో చూపి లెనిన్ చెప్పిన ఈ మాటలను ధృవీకరించాడు: "రష్యన్ గ్రామంలో వర్గ చైతన్యంగల కొత్త యువశక్తి ఉదయించింది. పత్రికలు చదువుతూ నగరాల్లో జరిగే విషయాలను రైతులకు చెప్పుతూ, రాజకీయ డిమాండులను తోటి గ్రామీణులకు వివరిస్తూ, భూస్వాములనూ, పూజారులనూ, ప్రభుత్వాధికారులనూ ఎదిరించి పోరాడేట్టు చేస్తూ ఈ కొత్త శక్తి తిరుగుబాటుదారులతో సంబంధం పెట్టుకున్నది."

సమకాలీన సాహిత్య పరిణతికి సంబంధించిన అనేక ప్రశ్నలకు సమాధానాలు లెనిన్ గోర్కీకి రాసిన వుత్తరాల్లో మనకు లభిస్తాయి. ఇందులో ఒకటి– సామ్యవాద వాస్తవికతలో విమర్శలకు సంబంధించిన ప్రశ్న. ఇక్కడ మనం గోర్కీ రచనల్లోని జీవిత సత్యాల పట్లా, క్షీణవాదులనూ, నిరాశావాదులనూ, అభివృద్ధి నిరోధకులనూ ఎదుర్కోవడంలో గోర్కీ సలిపిన నిరంతర పోరాటం పట్లా లెనిన్ చూపిన అంగీకారాన్ని గమనించాలి. లెనిన్, గోర్కీ యిద్దరూ అన్నిరకాల క్షీణవాదాలనూ పూర్తిగా నిరాకరించడం మనకు స్పష్టంగా కనిపిస్తుంది.

లెనిన్ భావన కనుగుణంగా పాత పెట్టుబడిదారీ సమాజం బ్రద్దలైపోయి కొత్త సామ్యవాద సమాజం ఏర్పడడాన్ని– గోర్కీ తన రచనల్లో ప్రతిబింబించాడు. ఈ మహా రచయిత రచనల్లోని ముఖ్య విషయం యిదే. పెట్టుబడిదారీ విధానాన్ని నిర్దయగా బహిర్గతం చేసిన ఆయన రచనల అమోఘమైన శక్తి ఆయన సాహిత్యానికి ఉన్నత స్థానాన్ని కల్పించింది.

["లెనిన్–సాహిత్య సమస్యలు" (ఆంగ్లం) నుంచి స్వేచ్ఛానువాదం]



సవరణ

'భారత స్వాతంత్ర్య పోరాటాలు' ప్రతులకు రాజమండ్రిలో యేలూరి సూర్యారావు గారికి రాయాలి–

(40వ పేజీలో అచ్చయినట్లు సుబ్బారావుగారు కాదు–)

# మనం కలగనాలి!

## లెనిన్

"మనం కలగనాలి!" ఈ మాటలు రాశానో లేదో నాలో ఆందోళన మొదలైంది. 'ఐక్యతా సమావేశం'లో కూర్చునివున్నట్టూ, 'రబోచెయేద్యేలో' పత్రికాసంపాదకులూ, వ్యాసకర్తలూ నాకెదురు వరసలోవున్నట్టూ వూహించుకున్నాను. కామ్రేడ్ మార్టినోవ్ లేచి నాకేసి తిరిగి, కఠిన స్వరంతో ఇలాగంటాడు: "పార్టీ కమిటీల అభిప్రాయమేమిటో అడిగి తెలుసుకోకుండానే స్వయం పాలనాధికారంగల సంపాదకమండలి కలగనే హక్కు వున్నదా అని మిమ్మల్నడగనివ్వండి." ఆయన వెంబడి కామ్రేడ్ క్రిచెవస్కీ (కామ్రేడ్ ప్లెఖనోవ్‌ను గంభీరతరుణ్ణిగా చాలాకాలం క్రితమే చేసిన కామ్రేడ్ మార్టినోవ్‌ను తాత్వికంగా మరింత గొప్పవాణ్ణిచేస్తూ) ఇక కొంచెం కఠినమైన స్వరంతో ఇలాగంటాడు. "నేనింకో అడుగు ముందుకిపోతాను. మానవులు తాము పరిష్కరించుకోగల కర్తవ్యాలనే లక్ష్యంగా నిలుపుకుంటారని మార్క్సు అని వున్నాడు గనకనూ, ఎత్తుగడలనేవి పార్టీతోబాటు పెరిగే పార్టీ కర్తవ్యాల పెరుగుదలకు చెందిన క్రమమే గనకనూ మార్క్సిస్టయిన వాడెవడికైనా కలగనే హక్కు వుందా, అని అడుగుతున్నాను."

కర్కశమైన ఈ ప్రశ్నల గురించి ఆలోచిస్తేనే నా వెన్నుపూస జివజివలాడుతున్నట్టుగా వుంది. ముఖం దాచుకునేందుకింత జాగా వుంటే బాగుండు ననిపిస్తుంది: పిజరేవ్ వెనకతట్టున దాక్కునేందుకు ప్రయత్నిస్తాను.

కలలకూ వాస్తవానికీ మధ్యగల తేడాల గురించి రాస్తూ, పిజరేవ్ "తేడాలు ఇన్నీ అన్నీ కాదు" అన్నాడు. ఇంకా ఇలా రాశాడు: "నా కల సంఘటనల సహజ క్రమాన్ని దాటుకుని ముందుకుపోవచ్చు. కథా సంఘటనల సహజక్రమం ఎన్నటికీ సాగని తెన్నునబడి దూసుకునీ పోవచ్చు. మొదటిదే జరిగితే నా కలవల్ల ఏ కీడూ వుండదు. పైపెచ్చు కష్టజీవుల శక్తిని అది బలపరిచి వృద్ధి చెందించవచ్చు కూడా. ...శ్రమ శక్తిని వికృతం చేసేదిగానీ స్తబ్ధపరిచేదిగానీ ఇలాంటి కలల్లో యేదీవుండదు. అలా జరక్క, ఈ విధంగా కలగనే శక్తిని మనిషి కోల్పోతాడనుకుందాం, ఘటనల్ని దాటుకుని ముందుకుపోయి, తన చేతులిప్పుడిప్పుడే ఆకృతికలిగిస్తూన్న వస్తువుతాలూకు పరిపూర్ణ, సమగ్ర చిత్రాన్ని మనస్సుతో భావించలేదనుకుందాం. అప్పుడు కళలోగాని, విజ్ఞాన శాస్త్రంలోగాని, తక్షణాచరణకు సంబంధించిన కృషిలోగాని సువిస్తారమైన, ప్రయాసతో గూడిన పనిని తలపెట్టి పూర్తి చేసేందుకు మనిషిని ప్రేరేపించగల శక్తి యేమిటైవుంటుందో నా వూహకు తోచదు. కలగనేవాడికి తన కలలోనమ్మకంవున్నట్టయితే, అతగాడు జీవితాన్ని పరిశీలించి తన పరిశీలనాంశాలను ఆకాశహర్మ్యలతోటి

శ్రద్ధగా పరిపోల్చేటట్టయితే, అద్భుతమైన తన వూహలను నిజంచేద్దామని అతడు మనస్సుపెట్టి పనిచేసేటట్టయితే, కలలకూ వాస్తవానికీ మధ్యగల స్పర్థవల్ల యేనష్టమూ వుండదు. కలలకూ జీవితనికీ యేదో సంబంధం వుంటే అంతా సవ్యంగావుంటుంది."

కలగనడం దురదృష్టవశాత్తు మన వుద్యమంలో బహుతక్కువగావుంది. తమవి స్థిమితమైన భావాలని, "నిర్దిష్టమైన" దానికి తమది "సామీప్యం" అని గొప్పలు చెప్పుకునే వాళ్లు ఈ స్థితికి ముఖ్యకారణం. వీళ్ల చట్టబద్ధమైన విమర్శకు, చట్టబద్ధం కాని "తోకవెంబడి నారాయణ తత్వా"నికీ ప్రతినిధులు.

— వాట్ ఈజ్ టు బి డన్ (1901-1902) నుంచి

---

వచ్చే సంచికలో ....

- ఎమర్జెన్సీ చీకటి తెరచాటున ఉరితీయబడిన రైతాంగ గెరిల్లాలు భూమయ్య, కిష్టాగౌడ్‌ల స్మృతికి ప్రత్యేక వ్యాసం.
- సుబ్బారావు పాణిగ్రాహి సంస్మరణ
- గిరిజనుడు - పాట : వంగపండు ప్రసాదరావు
- జూలియస్ ఫ్యూజిక్ "ఉరికంబంపై ఉజ్వలగీతం" రక్తాక్షరాలు - పరిచయం
- మొలీనాధక్ మొక్కవోని విప్లవదీక్ష
- నవోదయ "జనంపాటలు" - సమీక్ష

---

## రచనలు కావాలి

ప్రజా జీవితాన్ని, ప్రజా పోరాటాలను చిత్రించే సృజనాత్మకమైన, కళాత్మకమైన రచనలు ముఖ్యంగా కథలు పంపించ వలసినదిగా రచయితలను కోరుతున్నాం. ప్రతి నెలా 10 వ తేదీలోగా మాకందేలా రచనలు పంపించాలి.

— సంపాదకుడు

---

## సృజనపై మీ అభిప్రాయాలు తెలపండి

సృజన పునః ప్రారంభమైనప్పటి నుంచీ మీకెలాగుంటున్నదో మీ నిర్మొహమాటమయిన అభిప్రాయాలు రాయండి. సృజన ఎలా వుండాలని మీరు కోరుకొంటున్నారో కూడ రాయండి—

— సంపాదకుడు

రెండు స్మృతి గీతాలు:

# ఎర్ర మందారం!

అవును —

నాకా విషయం బాగా తెలుసు
నిశీధి నిశ్శబ్ద సంఘర్షణలో
పారిన నెత్తుట్లో నువ్వు
నువ్వు ఎర్రమందారానివై పూచిన రోజుకి-
నీకు నిండా పద్దెనిమిది
వసంతాలూ రాలేదు
కనీసం మీసాలైనా రాలేదు!

సిద్ధాంత గ్రంథాలన్నీ
పుక్కిట పట్టేసి
సంకుచితత్వపు
సరిహద్దు గీతల్లో బ్రతికే
మేధావిత్వ ప్రకర్షా రాలేదు-

తలపండి పోయిన
ఆశయాలుడిగి పోయిన
ఏముప్పయ్యేళ్ళ
రాచకీయానుభవమూ నీకు రాలేదు-

కానీ-

నమ్మినదాన్ని ఆచరణలో
రుజువు చేసుకునే చిత్తశుద్ధి
అందుకోసం బలై పోయే
నిజాయితీ మాత్రం నీకు వచ్చాయనే-
ఆవిషయం నాకు బాగా తెలుసు!

(ప్రకాశం జిల్లా తెట్టు సమీపారణ్యంలో
అసత్య సంఘర్షణలో అమరుడైన
కా|| మేడ్ పాలడుగు రామకృష్ణ
అరుణారుణ స్మృతికి— )

# ప్రేమ ప్రజల్ని ప్రేమిస్తుంది!

అమ్మ నాన్నను ప్రేమిస్తుంది;
అబ్బాయి అమ్మాయిని ప్రేమిస్తాడు
ఆవు దూడను ప్రేమిస్తుంది;
కవిగారు కవితల్ని ప్రేమిస్తాడు
నటుడు తన్నుతనే ప్రేమించుకుంటాడు
పాలకులు అధికారాన్ని ప్రేమిస్తారు;
పోలీసులు హింసను ప్రేమిస్తారు;
జడ్జిగారు దొంగసాక్ష్యాలను ప్రేమిస్తారు;
కానీ —
నువ్వు మాత్రం;
ప్రకృతి నియమాలనే ధిక్కరించి
ఆడంబరహీనమైన
నిశ్శబ్దతలో
ప్రజలందర్నీ ప్రేమించావు.

[తెట్టువద్ద పోలీసులచే కాల్చి చంపబడ్డ ఖిలాఫ్ ఉక్కు కర్మాగారం కార్మికుడు కామ్రేడ్ మాలకొండయ్య ఎర్రని జ్ఞాపకం కోసం.]

— అజ్ఞాత సూరీడు

---

ఇందిరా-వెంగళరావు కాంగ్రెస్ ఎమర్జెన్సీని అడ్డంపెట్టుకొని చట్టబద్ధంగా హత్య చేసిన భూమయ్య కిష్టాగౌడ్‌ల ద్వితీయ వర్ధంతి డిసెంబర్ 1వ తేదీన జరుపుటకు క్రొవ్విడి లింగరాజు అధ్యక్షులుగా యేలూరి సూర్యారావు, కె. శ్రీరాములు కార్యదర్శులుగా రాజమండ్రిలో ఒక అఖిలపక్ష సన్నాహక సంఘం ఏర్పాటైనది.

ఈ సందర్భంగా భూమయ్య, కిష్టాగౌడ్‌ల పోరాట వివరాలు, జీవిత చరిత్రతో చిన్న పుస్తకంలాంటి కరపత్రం, వారిపై వచ్చిన స్మృతి గీతాలు ప్రచురించి ప్రజలలో ఉచితంగా పంచాలని నిర్ణయించనైనది. విప్లవాభిమానులు, రచయితలు సహకరించగలరు.

వివరాలకు: యేలూరి సూర్యారావు, కొండూరివారివీధి,
టి. నగర్, రాజమండ్రి 533 101

## "ఎదురు తిరిగితే..." కొంచెం ఆగు బాబూ!

ఈ పెద్ద కథలో వస్తువు సమాజంలోని వాస్తవాలచుట్టే తిరిగింది. కథని వాస్తవం దాటిపోకుండా వుంచడానికి చాలా మెలకువ వుండాలి రచయితకి. ఆ పరిస్థితులతో అనుభవం కూడా అవసరం. ఈ కథారచయితవద్ద ఆ రకం అర్హతలు కొంతవరకు ఉన్నాయనే అనుకోవచ్చు.

కథలో నాయకుడు కొంరడు. (బొత్తకొంరడా?) వాడు దొంగతనం చేసినందుకూ, దొరోరిబండిని ఆపి ఎడ్లు విప్పేసి జీతం ఇచ్చేదాక బండి కదలనియ్య నన్నందుకూ దొర మొత్తం గూడానికే "నీరటి బిచ్చం" ఎగబెట్టాడు. దొరలు సాక్షాత్తూ హిరణ్యకశిపులే. ప్రజలు మాత్రం ప్రహ్లాదునివంటి వారుకారు. కానీ కానేపట్లా కనిపించడం కథ నడవడానికి అవసరం. నూరు డిగ్రీల వేడి అయితేనే గదా నీళ్లు మరిగేది! బూరుగువాగు ఎండిపోయినా, వానదేవుడు కొంపముంచి బావుల్లో నీళ్లెండిపోయినా ఊళ్లోవాళ్లు నూతుల్లో నీరు తోడుకోనివ్వకపోయినా మాదుగులంతా వరిమళ్ళలో "పొక్కదోడు"కున్నారు. నూరు డిగ్రీల వేడి రాకనే కొంరడు ఆవునమ్మి పంచాయితీ 'దడావతు' కట్టాడు. నీరటి బిచ్చం ఎగేసిన వాడికేం జుల్మానాలేదు. అడిగినవాడికి ఫైను "మాదిగ లంజకొడుకులాల! సెరోయాభై దడావతు" పెడితేగానీ పంచాయితీ నడవదని తేల్చారు న్యాయమూర్తులు. ఈ "సెరోయాభై" దొరా, కొంరడూ కాదు పంచాయితీలో వాది ప్రతివాదులు మాదుగులే! పంచాయితీ మాత్రం దొర నీరటి బిచ్చం ఇవ్వలేదని. దానిక్కారణం బొత్త కొంరడు! "దొర పొలంల దొంగతనం సేయిటం కాన్నుంచి దొరబండ్ల నటకాయించడం దాకా" వానిదే తప్పు.

తెలంగాణా పల్లెటూళ్లలో పంచాయితీ జరగడం కల్లుకుండతో మొదలు. పంచాయితీ ప్రారంభానికి ముందే పెద్దలు కల్లుతాగుతారు. పంచాయితీ తంతుతో సాక్షులూ, వాది ప్రతివాదులూ తాగుతారు. తర్వాత గెలిచిన వాళ్లు ఆనందంతో, ఓడినవాళ్లు విచారంతో తాగుతారు. ఈ ఖర్చంతా వాది ప్రతివాదులదే. తర్వాత ఎగేసే వీల్లేకుండా ముందే ఈ "దడావతు". కల్లు తాగిన న్యాయమూర్తులు చెప్పినదాన్ని వినకుంటే? "అగ్గినీల్లు బంద్" అదీ సంగతి.

బొత్త కొంరని భార్య కోడిపెట్టగూర్చి "పోసి"తో పెట్టుకున్న పంచాయితీలో "పోసి" తో తన్నులుడిన్నా "తప్పంత దెబ్బలుపడ్డ మల్లిదేసేసిర్రు. దానికి దండుగ యాభైరూపాలు" ఈ దండుగ యాభై రూపాయలు ప్రాణంపోయినా ఇవ్వనని కొంరడు

ప్రమాణం చేశాడు. ఇంతకీ అవి "లక్కాపురం తాల్లల్ల పోద్దాడు కల్లు" తాగడానికట. సోమపానంచేసే దేవతలంతా పంచాయితీ పెద్దలై పుట్టారేమో అందుకే వారికి సుర మీద అంత ప్రీతి' దండుగ కట్టవి కొంరన్ని కులంలోంచి వెలేస్తే వాడు చెలకల్లో గుడిసె వేసుకున్నాడు. పరంబోకు దున్నుకుందామని నరారిని అడగడానికి వెళ్తే అక్కడ పాలేరు నర్సిమ్మడు అడ్డుపడ్డాడు. మామూలే— సేరు సారాసీసా, నంచుకోడానికీ కోడి పెట్టా! ఇక నరారికి నైవేద్యమే! డెబ్బయి రూపాయలు పదిరోజులు కట్టె కొట్టేవెట్టి!

పోరంబోకుదే ఐనా భూమిదక్కడం సాధ్యమేనా? కాదు! అందుకే అది పంట కొచ్చేసరికి దొరకళ్ళలో నిప్పులు కురిసాయి. దొరకీ నరారికీ డైరెక్టుగా పడదు గనక దొర బావ లక్ష్మారెడ్డి నరారిని జేబులో వేసుకున్నాడు. (లేక నరారి జేబులో రెండు వేలు వేశాడా?) ఈ లక్ష్మారెడ్డి సామాన్యుడేం కాదు. కంట్రాక్టు తీసుకున్న రోడ్డు తన పొలంలోంచి పోయేట్టుంటే పక్కనున్న రామిరెడ్డి పొలంలోకి తిప్పాడు. రామిరెడ్డి హైకోర్టు స్టే తెస్తే అతగాడి కరెంటుమోటారు పీకించాడు. ఇంతేకాక రాత్రికి రాత్రి రామిరెడ్డి భార్యనీ బిడ్డనీ "ఖరాబు" చేయించాడు. అతని "బొక్కలిరుగ" తన్నించాడు. కానీ ఓ చిక్కొచ్చింది. రామిరెడ్డి పాలేరు చర్మం ఒలిపిస్తే (నిజంగానే!) కేసు ఫైలయింది. డిఎస్పీ విచారణకొస్తే అతడికి నలభై వేలు కిట్టాయి. ఐనా రాజ్యం బాగులేదట! రామిరెడ్డి హైకోర్టులో కేసు పెట్టాడు. దాంతో నాలుగు లక్షలూడాయట. (ఇక్కడ రచయిత కొంచెం ఆలోచించితే బాగుండును!) ఇన్ని చిక్కుల్లోవున్న లక్ష్మారెడ్డి తన బావమరిదిని ఆదుకోవూనుకోడం అతని ఔదార్యమేమరి! మన వెంకటరెడ్డి గొప్ప రసికుడులా వున్నాడు. బావగారి బిడ్డకే పోజులుకొట్టి లొట్ట లేసుకున్నాడు. అందం ఎక్కడవున్నా ఆస్వాదించాలని వారి సిద్ధాంతంగావును! ఈ దొరలు కార్యంలోకి దిగాక నరారి పంతులు కొంరని చెలక "దొరోరికంచె నెంబర్లనే" వున్నదన్నాడు.

ఇక్కడికి నూరు డిగ్రీల వేడి పూర్తయింది. నీళ్లు మరగడం ప్రారంభించాయి. గొడ్డలి భుజాన వేసుకొన్న కొంరడు "పోండి నా పెరట్కాన్నుంచి పోండి. లేకుంటే నేనేం సేత్తనో నాకే తెలువదు" అన్నాడు. కానీ ఉరుములు పిడుగులవుతాయా? "సూత్తరేంరా? అన్నిరిసి కట్టేయిర్రి" అన్నా పాలేర్లు దొరమాటలు వినలేదు. వాళ్లు ఆలోచనల్లో పడ్డట్టున్నారు. కొంరని మాటలు వాళ్ళకి అంత ఆలోచన ఎలా కలిగించాయో మనకి అర్థంకాదు. (కొంరడు దొరని ఆపినా, దవడమీద గుద్దినా గట్టుమీద పడదోసినా కిమ్మనలేదు పాలేర్లు.)

దొరకిదంతా ఏం పట్టింపు? అందుకే స్వయంగా పొలంలోకి దిగబోయాడు. "ఈ పెరడు బొబ్బిలి గావాలె" కొంరడు గొడ్డలి గాలిల తిప్పాడు. అయినా దొర ఆగడు. అడుగు ముందుకే వేశాడు. వీరులెప్పుడూ ముందుకే నడుస్తారు మరి. "ఖండవ"తో చెమట తుడుచుకోవడం వేరే సంగతి. కొంరడు దొర కొడవలి ఎగరగొడితే దొర కొంరని దవడ పగలగొట్టాడు. మరి దొర పళ్ళెవ్వాడి నెత్తుర్లాలికాయి తర్వాత. పాలేర్లు ఆదుకోలేదు. దొరకు దుఃఖమొచ్చింది ఎంత యోధుడైనా ఒక్కడుపోరాడ్డం మంచిదికాదని నీతిగదా! యుద్ధంలో తనతోనే తలపడ్డ విభీషణున్ని రావణుడు చూసినట్టు పాలేర్లని చూసి వుంటాడు దొర. కొంరడు నెట్టేస్తే గట్టుమీదపడి నొసలు చిట్లగొట్టుకున్నాడు. లేచినించుని– ఇక చేసేదేముంది? పరిగెత్తడమే! కొంరని భూమి కొంరనికి దక్కింది. కానీ ఇదెంతకాలం వుంటుంది? వాడిపేరుమీద పట్టాలేదు. అంత అవమానం పొందిన దొర కొంరన్ని ఎంతకాలం సహిస్తాడు? దొరనూ, దొర చేతికింది పంచాయితీ పెద్దల్నీ ఎలా ఎదుర్కొంటాడు? జుల్మానా కట్టనందుకు కులం నుంచి వెలేసిన పెద్దలు ఈసారి దొరని కొట్టినందుకు ఊర్నించి తరిమేస్తే?

పల్లెటూరి దొరలు కుంభనికుంభులవంటివారు. ఒకడికొకడు తోడు– చాకలి రాయనర్సని భార్య ప్రసూతి బాధతో మరణావస్థలో వున్నా వాణ్ణి తన బండిముందు పరిగెత్తించుకున్నవాడు ఎంకటరెడ్డి. తర్వాత నాలుగులక్షలు ఖర్చయితేనేంగాక ముందు రామిరెడ్డిమీద ఎంత నీచంగా పగదీర్చుకున్నవాడో లక్ష్మారెడ్డి! వీళ్ళ చెప్పులు నాకే నరారి పంతులు, "పోయి దక్కల్లోండ్లల్ల" కలవమన్న కుల పెద్దలు, ఈ చక్రాన్ని కొంరడు ఎలా ఛేదిస్తాడు? వాడికేమీ రాజకీయ చైతన్యం వున్నట్టు లేదు. కనీసం ఆ చుట్టుపక్క వూళ్ళలోనైనా అలాంటి ఛాయలు లేవు. వ్యక్తులు వైయక్తిక అనుభవాల వల్ల తిరుగబడితే లాభం ఏమిటి? టూంఖాల్ తిరుగుబాటు, మన్య ప్రజల తిరుగుబాటూ అణిగిపోవడానికి కారణాలు అవి ఏ రాజకీయ చైతన్యం లేనివి కావడమేగదా! అందుచేత తిరుగుబాటనేది రాజకీయ పరంగా జరిగినప్పుడే అది గెలుస్తుంది. కొంరడు తిరగబడితే . ...మసి అవుతాడు. సందేహంలేదు వాడు ఓడిపోతాడు. అందుచేత రచయిత కొంత రాజకీయ వాతావరణాన్ని కల్పించి వుండవల్సింది. దాంతో కథకి సమగ్రత వచ్చివుండేది. అది లేకపోవడం చాలా పెద్ద లోపంగా కన్పిస్తోంది ఇక కథలోవున్న మాండలికం దానికో అలంకారంగా భావించవచ్చు. రచయిత అక్కడక్కడా చేసిన వర్ణనలు :

"ఏగిలి వారుతంది. గుట్టసుట్టూరుత నాతేర్సిన పనసు పంజరాన్ని నరకటానికి తూరుపునుంచి సూరుని కాంతి కత్తి కటారులిసురుకుంట బాణాలిసురుకుంట బంఢిగిరెవవుతగ దూసుకవత్తంది."

"మోటగీరె కిర్రుకిర్రుమని రాగం తీస్తుంది. అడివిల సీతువ పలుకుతాంది..."

ఇలాంటి వర్ణనా దృశ్యాలు బాగున్నాయి. సహజత్వంకోసం వాడబడిన బూతు తిట్లు సాహిత్య తీర్థంకరులకు నచ్చకపోయినా అది ప్రజాజీవితం అంతర్భాగమేనని వారికితెల్సు. చాలా మంది నిమ్నజాతి ప్రజలకి తిట్టు ముందూ మాట తర్వాతా వస్తుంది. అది వారి అలవాటు. ఈ అలవాటు పల్లెటూరి దొరలకీ వుంది. అదీ వారి అలవాటే.

ఈ కథానాయకునిలో ఒక లోపం కన్పిస్తుంది. దొరనీ, ఆతడిచేతి కిందివాళ్ళనీ గూర్చి ఆలోచించుకుంటూ అక్కడక్కడా కసిగా తిట్టుకుంటాడు ఓచోట పోశాలు అనేవాడి గూర్చి "లంజకొడుకును బొత్తవలుగ్గొట్టి జేలుకు బోదును" అనుకుంటాడు. కానీ వెంటనే ''పెద్దలోకులు... ఏంజేసినా జెల్లుతది'' అనుకుంటాడు. ఇది అతని తాత్కాలిక ఉద్రేకాన్ని మాత్రమే సూచిస్తుంది. ఇలాంటి వాళ్ల ఎందరు ఎన్నిసార్లు తిరగబడ్డా ఫలితంమాత్రం వుండదు. ఆవేశానికి ఒక సిద్ధాంతాన్ని జోడించి ఆచరిస్తేనే అది గెలుస్తుంది. ఏ విధమైన రాజకీయాలు లేకుండా ఎదురుతిరిగితే... మంచిదికాదు.

సి. బి. రామశాస్త్రి
కె. రాంమోహన్‌రాజు

## జరుగుతున్న చరిత్ర

ఈ కథలోని పాత్రలు ప్రతి పల్లెలోనూ ఉండేవే. ఇందులో కథ పెద్దగా లేకపోయినా రచయిత చూపిన పరిష్కారం అద్భుతమైంది. ఈ పరిష్కారమే మొన్న జనచైనాలోనూ నిన్న వీర వియత్నాంలోనూ జరిగింది. కొంరని పాత్రి చాలా అరుదైనది. ఎందుకంటే సంప్రదాయ సంకెళ్ళను త్రుంచడం... జీవితంలో ఎంతగానో విసిగి వేసారిన వ్యక్తికి తప్ప సాధ్యంకాదు. అతడు నిరక్షరాస్యుడు. అతనికి తగినట్లే భాషకూడా అతని పాత్రకు వన్నె తెచ్చింది. జీవితాన్ని కాచి వడబోసి ఇక దేనికీ పరిష్కారం కాని సమస్య ఇదని గ్రహించిన పాత్ర ఇది. ఈ పాత్రలో రచయిత దృక్పథాలన్నీ ఇమిడివున్నాయి. ఈ పాత్ర కరణం నరహరితో మాట్లాడేటపుడూ... ఇంకొందరు పెత్తందార్లతో మాట్లాడేటపుడూ స్వగతంలోని రచయిత వ్యాఖ్యానం ఆ పాత్రిలోని భావాలు చెప్పడం ఆ పాత్ర భావాలకు అద్దంపట్టి ఆ పాత్రకు మెరుగు చేకూర్చింది. ఈ కథకు ఆ కొంరని పాత్రే జవాన్ని జీవాన్ని కూర్చింది.

ఇకమిగిలిన పాత్రలు సాధారణంగా గ్రామాల్లో, గూడేల్లో ఉన్నట్లుగానే ఉన్నాయి ఆ పాత్రిలకు తగ్గ భాషను సృష్టించడంలో రచయిత చూపించిన శ్రద్ధ శ్లాఘనీయం.

మాదిగోళ్ళు పెత్తందార్ల ఇంటికి పోయినపుడు వారి నిర్లక్ష్య వైఖరి, అహంకారపు ప్రవర్తన, మానవత్వ హీనమైన వారి మాటల ధోరణి రచయిత చాలా చక్కగా చిత్రీకరించారు. కథ అనడం కన్నా 'జరుగుతున్న చరిత' అనడం చాలా బాగుంటుంది. తన భావాలను చెప్పడంలో రచయిత సంపూర్ణంగా సఫలీకృతుడయ్యాడు. గూడెంలోని ఇతరుల మనస్తత్వాలు, తోటి మనుషులపై వారి ప్రవర్తన కూడా రచయిత చక్కగా విపులీకరించారు. మార్క్సిస్టు అవగాహనతో రచయిత ఈ కథను సృష్టించారనడంలో సందేహం లేదు. ఈ కథ అంతా చదివి చివరకొచ్చేంత వరకూ నాకిది 'యదార్థ సంఘటన'లాగానే కనబడింది. ఇపుడుకూడా అదేవిధంగా దీనిని ఆదరిస్తున్నాను. 'సృజన'కు ఇంతకంటె మంచి కథలు వేరే ఉన్నాయా?

నేను రచయితను అతిగా పొగడటంలేదు. అతడు ఆయా పాత్రలను సృష్టించిన తీరు, ఆ కథాగమనం అంతా ఆయా పాత్రలను బాగా 'స్టడీ' చేసి వ్రాసినట్లుంది. ఇటీవల ఏ పత్రికలోను ఇంత చక్కని కథను చదివి ఉండలేదు. రచయిత రాజయ్య గారికి నా విప్లవాభినందలను తప్పకుండా తెలుపుతారని, ఇంకా అతను జనం జీవింతో తొణికిసలాడే కథలను వ్రాయమని చెబుతారని సంపాదకులవారిని అర్థిస్తున్నాను.

విప్లవాభినందనలతో

— నాగేశ్వరరావు, ఎ. ఎన్.,
కావలి

'ఎదురు తిరిగితే' కథ ఒక మేరకు గ్రామీణ జీవితాన్ని ప్రతిబింబించినా, పూర్తిగా మాండలికాన్నే (యాసభాషనే) వాడాలనే రచయిత తాపత్రియంవల్ల, మరీ దీర్ఘంగా ఉండడంవల్ల నామట్టుకు నాకు బోరింగుగానే అనిపించింది. కథలు ఆసక్తిజనకంగా సందేశాత్మకంగా, సరళమైన భాషలో, సాధ్యమైనంత సంక్షిప్తంగా ఉంటే బాగుంటుందని నా అభిప్రాయం.

— మల్లిక్

---

సవరణ

అక్టోబర్ 77 సంచికలో "ఎదురు తిరిగితే..." కథలో ఈ క్రింది చోట్ల "నర్సింహ్మారెడ్డి" అని వున్నచోట "లక్ష్మారెడ్డి" అని చదువుకోవాలి:

| | | | |
|---|---|---|---|
| పేజి 41 | లైను 1 | పేజి 44 | లైను 7 |
| 42 | 20 | 45 | 19 |

# భాషను గురించి...

'సాహిత్యంలో వస్తుశిల్పాలు' అన్న విషయంపై శ్రీ త్రిపురనేని మధుసూదన రావుగారి విమర్శనా వ్యాసం చాలా స్పష్టంగాను, సరళంగాను, నిశితంగాను వుంది. సాహిత్యం మీదా, దాని పుట్టుక, ప్రయోజనాల మీదా రచయిత వెలిబుచ్చిన అభిప్రాయాలన్నీ చారిత్రక పరిణామాల్ని నిర్దుష్టంగాను, విశ్లేషికంగాను వివరిస్తున్నాయ్. "వస్తువులో కలిసిపోయేదిగా వుండే శిల్పాన్ని మనం చేపట్టాలి" అని రచయిత 'వస్తువు'కి ప్రాధాన్యం ఇవ్వటమూ, శిల్ప లక్షణాన్ని నిర్దేశించటమూ కూడా అభ్యుదయకరమూ, అనివార్యమూ అయిన సామాజిక సత్యమే. కానీ భాషను గురించిన రచయిత అభిప్రాయం మాత్రం సరియైనది కాదు. ఎందుకంటే "సమాజ దశలు మారుతుంటే భాష మారటంలేదు" అన్నది తప్పు. భాషలపట్ల శాస్త్రీయావగాహన వున్న ఎవరైనా చారిత్రకంగా భాషా పరిణామాన్ని పరిశీలించినప్పుడు ఇది తప్పని నిరూపించవచ్చు. అలా నిరూపించబడింది; బడుతున్నది కూడా. అయితే ప్రాథమికంగా భాషకున్న వ్యవస్థ అంటే మూలరూపంలో పెద్దమార్పులుండవు. కానీ 16వ శతాబ్ది భాషకీ, 18వ శతాబ్ది భాషకీ, నేటి భాషకూ చాలా తేడావుంది. పైగా నాడు లేని ఎన్నో నూత్న పదజాలం నేటి భాషలో ఉన్నై. "భాషలో విప్లవాలంటూ ఉండవు" అన్నది కూడా తప్పే. ఎందుకంటే కరుడుగట్టిన గ్రాంధిక భాషావాదుల్ని ఎదిరించి వ్యవహార భాషకి గుర్తింపునీ, సాహిత్యరూపాన్ని ఇవ్వడానికి గిడుగు, గురజాడలు ఎదుర్కొన్న కష్టనిష్టూరాల్ని పరిశీలిస్తే తప్ప ఇది అర్థంకాదు. అయితే భాషలో వచ్చే విప్లవాత్మక మార్పు మన కంటికి వచ్చేముందుగాని, వస్తూన్నప్పుడుకాని కన్పించదు. వచ్చి, స్థిరపడ్డాక మనం జాగ్రత్తగా చూస్తే, అప్పుడు కనిపిస్తుంది. దీనికి ముఖ్యకారణం, మనం భాషను "ఊపిరి పీల్చడం" లాగా ప్రత్యేక గుర్తింపు ఇవ్వకుండా వాడుకోపడమే.

ప్రక్రియకీ, భాషకూ అవినాభావ సంబంధం వుంది. అట్లాగే భాషకీ, సాహిత్యానికీ, ప్రజాశ్రేయస్సుకీ కూడా. ఎంత విశ్వశ్రేయస్సే తమ కావ్యాల ప్రయోజనమని చెప్పుకున్నా ప్రాచీన కవుల భాషా, సాహిత్యాలు సామాన్య జనానికి దూరంగా వుండటానికి కారణం, అవి రాచరిక వ్యవస్థ పటిష్టతకు వుద్దేశించడమే. ఆ ప్రక్రియల్లో వాడిన భాష ఆనాటి ప్రజల భాష కాదు. ప్రజల భాషలో వాళ్లకు ప్రత్యేకంగా జీవవంతమైన జానపద సాహిత్యం వుంది. ఆనాటి సాహిత్య ప్రయోజనం ప్రజల్ని అజ్ఞానంలో వుంచటమే; అందుకే అవి ప్రజల భాషలోలేవు. ఈనాడు కూడా అక్షరాస్యుల భాష అధికారభాష వేరు. ప్రజల భాష వేరు. అయితే ఈ రెంటినీ సమన్వయ పర్చడం నేడు

అధికంగా కన్పిస్తుంది. దీనికి కారణం నాగరికీకరణమూ, ప్రజాజీవితాన్నీ అనివార్యంగా ప్రభావితంచేసే యాంత్రిక పురోగమనమూ, అందు కవసరమైన కార్మికజనాన్ని దోపిడిని అర్థంచేసుకోనీయకుండా కళ్లకప్పటానికి వంచనకోసంచేసే ప్రయత్నం మాత్రమే.

"ఒకే భాషలో బూర్జువాలు తమ సిద్ధాంతాలనూ, కమ్యూనిస్టులు తమ సిద్ధాంతాలనూ చెప్పవచ్చును" అన్నది ఎంత సత్యదూరమో ఈ మధ్య "చర్చ" ('చర్చ', స్టడీఫోరం, ఆగస్టు 1977, వరంగల్)లో క్వశ్చనీర్‌లో వివిధ సాహిత్యకారులతో వేసిన ఇంటర్వ్యూలో "ప్రజాకవి" కాళోజి జవాబుల్నిచూస్తే అర్థం అవుతుంది. భాష ఒకటిగా అనిపిస్తుందే తప్ప ఒక్కటే కాదు. దాన్లో ఎంతో వైరుధ్యంవుంది. నిజానికి చర్చలో అడిగిన ప్రశ్నలు రాజకీయ, చారిత్రక, సామాజిక, ఆర్థిక విషయాలపట్ల శాస్త్రీయంగానో, అశాస్త్రీయంగానో అవగాహన లేనివాళ్ళకు బొత్తిగా అర్థం కాదంటె ఆశ్చర్యం ఏం లేదు. (కాళోజీకి నిజంగా అర్థం కాలేదా అన్నది అప్రస్తుతం) కాగా, బూర్జువాల భాషా, కమ్యూనిస్టుల భాషా ఒక్కటేనా? అయితే కమ్యూనిస్టులకున్న ప్రత్యేక సాంకేతిక పదజాలం అందరికీ అర్థం అవుతుందా? అసలు కమ్యూనిస్టుల లేదా విప్లవ రచయితల భాష అందరికీ ముఖ్యం జనసామాన్యానికి అర్థం అయ్యేదేనా అని ఆత్మవిమర్శ చేసుకోవాల్సిన అవసరం ఎంతైనావుంది. శ్రీశ్రీ సాహిత్యంలోనే 'జట్కావాలా' అర్థమైనంత బాగా సామాన్యునికి 'మహాప్రస్థానం' అర్థంఅవుతుందా? పాణిగ్రాహి పాటలు అర్థమైనంత సులభంగా దిగంబర కవిత్వం అర్థంఅవుతుందా? గద్దర్ పాటలు అర్థమైనంత సరళంగా, తేలికగా 'జైలు కోకిల' అర్థం అవుతుందా?

నిజానికి నేటి విప్లవ రచయితల రచనల్లో అధికశాతం సామాన్య జనం కోసం కాక, చదువనేర్చిన, ఆలోచననాపరులకూ, అభ్యుదయకారులకు ఉద్దేశించినట్లే కన్పిస్తోంది. వాళ్లవాడే భాష చూస్తే.

ఉదాహరణకి దిగంబర కవుల సాహిత్యంలోనే చెరబండరాజు కవితలు అర్థమైనంత సులభంగా జ్వాలాముఖివి అర్థం అవుతాయని అనుకోను. దీనిక్కారణం వస్తువు కాదు; భాషే. ఇద్దరి లక్ష్యం ఒక్కటే అయినా, భాషలు వేరేకావడంవల్ల, తర్వాత కాలంలో చెరబండరాజు ప్రజలకి వెళ్ళగలిగినంత దగ్గరగా జ్వాలాముఖి వెళ్ళలేక పోయాడు.

కాబట్టి ఒకే భాష అంటూ వుండదు. సామాన్య జనంలో అధిక శాతానికి అర్థం అయ్యేలా రాయగలగడం ప్రధానంగా విరసం రచయితల బాధ్యత. సులభశైలీ, సరళమైన భాషా లేకపోతే ఎంతటి "ప్రజావస్తువై"నా దాని కర్తవ్యాన్ని పూర్తిగా నెరవేర్చ

లేదు. భాషలోని క్లిష్టత వల్ల విరసం రచయితలు సాధించేది యేమీ వుండదు. ఇది వారి లక్ష్యాన్ని దెబ్బతీస్తుంది కూడా. కాబట్టి చెప్పదలుచుకున్నదాన్ని ప్రజల భాషలో, లేదా సరళభాషలో (అది కవితయైనా, గద్యమైనా మరేదైనా) చెప్పాల్సిన బాధ్యతని విరసం స్వీకరించాలి. శబ్దాడంబరం, సంస్కృత పదాలపైనా, సమాసాలపైనా వ్యామోహం పోగొట్టుకోవాలి. ఎంత విద్యాధికులకైనా, ప్రయత్నిస్తే, ఇదేమీ కష్టమైనదీ, అసాధ్యమైనదీ కాదు. అట్లా కానప్పుడు లక్ష్యసాధనకు గురి సరిగావున్నట్లు కాదు. ఇది గొప్ప అవగాహనాపరుడైన మధ్యతరగతి మేధావి. ఎంత నిజాయితీతో కూడిన కమిట్‌మెంట్‌వున్నా, నాగరిక వేషధారణతో ప్రజల్ని చైతన్యవంతం చేయడానికి ప్రజల దగ్గరికి వెళ్ళినట్లు అసహజంగానూ, అస్వాభావికంగానూ, హాస్యాస్పదంగాను వుంటుంది.

— ఉషాదేవి
హైదరాబాదు

## ఒక విమర్శ

సృజన మూడు సంచికలూ చదివిన దరిమిలా నాకు మీ పత్రికపై కల్గిన అభిప్రాయాలు ప్రశంసాపూరితంగానైతే లేవు.

మొదటగా రెండవ సంచిక (స్నేహలత ఫోటో గలది.) తప్పితే మిగతా రెండూ పూర్తిగా పేలవంగా ఉన్నాయని అనిపించింది. కళారూపమూ, వస్తువూ రెండూ లోపించిన సాహిత్య పత్రికగా అగుపించింది.

అదట్లుంచి, మూడు సంచికల్లోనూ అత్యంత ప్రధాన లోపం సమకాలీన రాజకీయ పరిణామాలను సాహిత్యరూపకంగా ప్రతిబింబించే, వ్యాఖ్యానించే ధోరణే లేకపోవడం. ప్రజా పోరాటాలను ప్రతిబింబించే పత్రిక, విప్లవ రాజకీయాలకు అతీతంగా ఉండజాలదు; ఉండకూడదు. ముఖ్యంగా ఎమర్జన్సీ ప్రకటన, అనంతర కాలంలోని క్రూరమైన అణచివేతలు, ప్రజల ప్రతిఘటన, మార్చి ఎన్నికలలో ప్రజలు సాధించిన ఘన విజయం, ఒక మేరకు పౌరహక్కుల పునరుద్ధరణ, జనతా ప్రభుత్వపు ఏర్పాటు, ప్రభావం, దాని ద్వంద్వ విధానాలు. పౌరహక్కులకై, రాజకీయ ఖైదీల విడుదలకై కొనసాగుతూన్న ఉద్యమాలు వీటన్నిటినీ ప్రతిబింబించని పత్రికకు ప్రజా సాహిత్య వేదిక అని చెప్పుకొనే అర్హత ఉండదు.

సృజన మూడవ సంచిక చైనా సాహిత్యపు అనువాదంగానే ప్రధానంగా ఉన్నది. ఒక విదేశీ పార్టీపై అంత గుడ్డి అభిమానం, అనుకరణ కూడదని నా దృఢ అభిప్రా

యం. స్వదేశ సమస్యలూ, సాహిత్యమూ ప్రచురణార్హమైనవి. తగినంతగానే ఉన్నాయనుకుంటాను

ముఖ్యంగా పౌరహక్కుల ఉద్యమానికి, దానికి అనుబంధమైన ప్రజాపోరాటాలకు ఇన్స్పిరేషన్ ఇచ్చే సాహిత్య వేదికగా సృజన రూపొందాలని నా ఆకాంక్ష.

- మల్లిక్

## సంపాదకీయం గురించి...

అక్టోబరు సృజన చూసి, సంపాదకీయం గురించి వ్రాయకుండా వుండ లేక పోతున్నాం.

మహత్తర చైనా ప్రజానీకానికి జే జే లు, విప్లవ కేంద్రంగా, ప్రపంచ విప్లవ ప్రజానీకానికాకి, పోరాటాలకు, గతంలో చైనా ఇచ్చిన మద్దతు పట్ల హర్షం ప్రకటించటం, చైర్మన్ చే రూపొందించబడి, ప్రారంభించబడిన మహత్తర సాంస్కృతిక విప్లవాన్ని కొనియాడటం అన్నీ బాగానే వున్నాయి. కానీ "తొందరపడి ఈనాడు చైనాలో జరుగుతున్న పరిణామాల మీద తీర్పు చెప్పటం మంచిదికాదు" అంటున్నారు సంపాదకులు. తీర్పు చెప్పటం తప్పుకాదు. చెప్పిన ఆ తీర్పు గతి తార్కిక పద్ధతిలో లేక పోవటం తప్పవుతుంది.

మార్క్సిస్టు-లెనినిస్టులు పవిత్రభావనను వ్యతిరేకిస్తారు. తీర్పు చెప్పకండి అని ప్రాధేయ పడ్తున్న సంపాదకుల పదజాలం వెనక వారికి గల పవిత్రభావం వ్యక్తం అవుతోంది.

తీర్పు చెప్పటంకానీ, మానటం కానీ విరసం వారి పని కాదు. అది రాజకీయ సంస్థల కర్తవ్యం.

మా అభిప్రాయం ప్రకారం చైనాను గురించి తీర్పు చెప్పటానికి కావలసిన దానికన్నా ఎక్కువే సమాచారం మనముందుంది. అంతకన్నా ఎక్కువే మౌలికమైన మార్పులు అక్కడ జరిగిపోయాయి. ఇప్పటికీ తీర్పు చెప్పటం తొందరపాటే అనుకుంటే, అలాంటి వారిని అమాయకులనుకోవాల్సొంటుంది.

''అంతర్జాతీయ సమస్యల ఎడల తటస్థ వైఖరి నవలంబించే వారిని అవకాశవాదులంటారు. వీరే భవిష్యత్తులో రివిజనిస్టులుగా మారుతారు'' అన్న చైనావారి సూత్రీకరణను ఈ సందర్భంలో మీకు గుర్తు చేస్తున్నాం.

ఘటనల పరంపరలు వాస్తవాన్ని మన కళ్ళముందు ఆవిష్కరిస్తున్నా, పవిత్రభావం అడ్డంపడి పలక లేక పోయేవాళ్ళు మధ్యేమార్గవాదులు — లేదా ఘటనల మధ్యగల

పరస్పర సంబంధాలను గురించి విశ్లేషించే గతితార్కిక పద్ధతి తెలియక ఘటనల్ని విడి విడిగా అంచనా కట్టుకుంటూ అయోమయంలో పడిపోయేవాళ్ళు తటస్థవాదులుగా మిగిలి పోతారు.

కథలు, కవితలు వ్రాసుకోండి– పాటలూ, పద్యాలూ పాడుకోండి– నాటకాలు, భాగవతాలూ ఆడుకోండి– పౌరహక్కులకోసం ప్రాధేయపడండి– మీకు నచ్చిన రాజకీయాల వెనక పడికొట్టుకొని పోండి. కానీ: రాజకీయ నిర్ణయాలు చెయ్యాలని మాత్రం అనుకోకండి. ఎందుకంటే నిర్ణయాలుచెయ్యటానికి కావలసిన నిజమైన జ్ఞానం మీ సంస్థయొక్క లేదా మీరు విశ్వసించే రాజకీయ సంస్థయొక్క మౌలిక ఆచరణ లోంచి మీకు లభించదు గాబట్టి.

—పి. నిర్మల
సి. స్నేహలత
టి. సుజాత
ఏలూరు

## జెయిలు పోరాటాల్లో రచయిత

ప్రిభంజనం పత్రిక సంపాదకులు, రచయిత, ట్రేడ్‌యూనియన్ లీడర్ ప్రొద్దుటూరుకు చెందిన డా॥ యం. వి. రమణారెడ్డిగారు 24-10-77 న నాకు వ్రాసిన లెటరులో ఈ క్రింది విషయాలున్నాయి.

డా॥ రమణారెడ్డిగారు ఒక హత్యకేసులో యావజ్జీవశిక్ష విధించబడి రాజమండ్రి ఖైదులోవున్నారు. ఆయన్ని బలవంతంగా హైదరాబాదు జైలునకు బదిలీ చేస్తున్నారు.

"ఈ నెల 14వ తేదీన ఐ.జి. ఆఫ్ ప్రిజన్సు రాజమండ్రి జైలు తనిఖీకి వచ్చినప్పుడు లోహిదాస్ అనే ఖైదీ ఇక్కడి జైలు అధికారులు రేషన్ను కాజేసి ఖైదీల పొట్టలు ఏవిధంగా మాడ్చుతున్నారో ఫిర్యాదు చేశాడు. దానికి ఐ. జి. చీవాట్లు పెట్టి వెళ్ళాడు. జైలు అధికార్లకు పూర్తి వత్తాసుగా నిలబడ్డాడు. అది అనరాగా చూసుకొని జైలు సూపరింటెండెంటు రెచ్చిపోయాడు. 18వ తేదీ అతన్ని స్వయంగా లాఠీతో బాది వొంటికొట్లో 24 గం. లాకప్ చేశాడు. ఆరోజు నుండే అతడు జైల్లో జరుగుతున్న అవినీతి, దోపిడీలపై దర్యాప్తు జరిపించాలనే కోర్కెపై ఆమరణ నిరాహార దీక్ష ప్రారంభించాడు. అందుకు సానుభూతిగా అదే కోరికపై 25వ తేదీ నుండి నిరవధిక నిరాహారదీక్ష ప్రారంభించటానికి నోటీసు పంపిన కామ్రేడ్ కాలేషా (నక్సలైట్ బ్లాక్, సి. టి. ఆర్. గ్రూపు)ను నిన్నటిరోజు లాకప్ అయిన తరువాత బలవంతంగా విశాఖపట్నం జైలుకు పంపివేశారు.

ఇక ఇప్పుడు మావంతు వచ్చింది ఇందులో తప్పక మేము కలుస్తాము, అనే అనుమానం వకటి, రెండవది మరీ ముఖ్యమైంది— మేము పోయిన నెల 26వ తేదీన సమ్మె చేసిన సందర్భంగా, ఖైదీకి ఇప్పుడు వచ్చే రేషన్ను మూడు పూటలకు విభజించి అందులో నుండి ఉదయం టిఫిన్ ఏర్పాటు చేయటానికి సూపరింటెండెంటు అంగీకరించాడు. ఇప్పుడిక్కడ ఉదయం 6 గంటలకు సాయంత్రం 6 గంటలకు రెండుసార్లుగా పెడుతున్నారు. హైదరాబాదులో దాన్నే మూడుపూటలుగా చేసి ఉదయం టిఫిన్ ఇస్తారు. వరంగల్, విశాఖలో కూడా మూడు పూటలుగా ఇస్తారు, కాని ఈ సూపరింటెండెంటుకు అది ఇష్టం లేదు. ఎందుకంటే మూడు పూటలమీద ఎక్కువ కాజేయటానికి వీలుపడదు. ఖైదీకి రోజుకు 700గ్రాములు బియ్యం వస్తుంది. అది2100 గ్రా. అన్నం అవుతుంది. కానీ యిప్పుడు ఇక్కడ ఖైదీలకు పూటకు 850 చొప్పున మొత్తం 1700 గ్రా. మాత్రమే యిస్తున్నారు. అందువల్ల ఖైదీలను బెదరించి ఎలాగైనా రెండు పూటలకే వొప్పించాలని, అది మేముండగా వీలుపడదని మా అందరినీ రహస్యంగా ఈ రాత్రి లాకప్ తరువాత హైదరాబాద్ పంపాలని పథకంవేసారు, కానీ ఉదయం ఈ విషయం తెలిసి, మేము ఈరోజు (24-10-77) సాయంత్రం నుండి ఆమరణ నిరాహారదీక్ష ప్రారంభిస్తున్నట్లు జైళ్ళ మంత్రికి మెమొరాండం వ్రాసి జైలు అధికార్లకు ఇచ్చాము. అందులో పై విషయాలు తెలుపుతూ ఈ కోర్కెలు కోరాము. 1. లోహిదాస్‌పై జరిగిన దౌర్జన్యానికి జైలు సూపరింటెండెంటు క్షమాపణ చెప్పుకొని అతన్ని మెయిన్‌జైల్లోకి తీసుకురావాలి. 2. బలవంతంగా ఇతర జైళ్ళకు కట్టే పద్ధతి రద్దు చేయాలి. 3. ఖైదీలకు రేషన్ సక్రమంగా వచ్చేట్లు చూడాలి. 4. జైలు సూపరింటెండెంటును తక్షణం బదిలీ చేసి అతడు జరిపిన అవినీతిపై దర్యాప్తు జరిపించాలి. 5. ఖయిదీల సొమ్ము తినమరిగిన ఆర్డర్లీని మార్చివేయాలి. జైలు అధికారుల జోక్యంతో దౌర్జన్యంగా యెన్నికైన మెంబర్లను దింపివేసి, తిరిగి ఎన్నికలు జరపాలి.

కాలేషాను ట్రాన్స్‌ఫర్ చేసింది మాకు అప్పుడు తెలియదు. రాబోయే ముందు తెలిసింది. ఆయన ఇచ్చిన నోటీసు లోహిదాస్ ఇచ్చిన నోటీసు ప్రభుత్వానికి పంపినట్లు కూడా లేదు. మా మెమోరాండంలను కూడా పంపుతారనే నమ్మకంలేదు. మేము ఎక్కడికి పోయినా సమ్మె కొనసాగిస్తాము. మొత్తం 35 మందిమి ఆమరణ నిరాహార దీక్షకు నోటీసు ఇచ్చాము. ఈ సాయంత్రం మాకు సానుభూతిగా జైల్లో 90% ఖైదీలు ఆపూట అన్నం పట్టలేదు. ఇప్పుడు మేము వచ్చిన తరువాత ఇతర ఖైదీ

లపై ఏ దౌర్జన్యమైనా జరుగవచ్చు. ఇది మామూలుగా జైలు అధికారులు అనాదిగా చేస్తూ వస్తున్నారు."

- చెరుకూరి సత్యనారాయణ
సహాయ కార్యదర్శి
ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ సంస్థ,
గుంటూరు జిల్లా కమిటీ

డాక్టరు ఎం. వి. రమణారెడ్డితోపాటు సమ్మెకు నాయకత్వం వహించిన మరొక 25 మంది ఖయిదీలను హైదరాబాదు జెయిలుకు 24వ తేదీ రాత్రికిరాత్రే రహస్యంగా మార్చినందుకు "అసమ్మతిగా 56 మంది ఖయిదీలు ఆ రాత్రి నుండి ఈనాటి వరకు నిరవధిక నిరాహార దీక్ష చేస్తున్నారు. వీరికి అండగా సానుభూతిగా 27-10-77 సాయంత్రం వెయ్యిమంది అన్నం తినటం మానివేసారు.

24వ తేది నుండి నిరవధిక నిరాహారదీక్ష చేస్తున్న 56 మంది ఖైదీలను మెయిన్ జైలు నుండి క్వారంటయిన్ జైలుకు మార్చారు.

దీనికి అసమ్మతిగా మరొక 25 మంది ఖైదీలు 27-10-77 సాయంత్రం నుండి నిరవధిక నిరాహార దీక్షలో పాల్గొన్నారు.

ప్రస్తుతం 82 మంది ఖైదీలు నిరవధిక నిరాహార దీక్ష కొనసాగిస్తున్నారు. జైలు అధికారుల దౌర్జన్యాలు, దోపిడీలు నశించాలని, నిరంకుశ జైలు అధికారులను ట్రాన్స్‌ఫర్ చేయాలనీ, విచారణ జరిపి తగిన చర్య తీసుకోవాలని ఖైదీలు నినాదాలు కూడా యిస్తున్నారని తెలుస్తున్నది" అని 29వ తేదీన తెలియజేస్తూ రాజమండ్రి జెయిల్లోని ఖయిదీల న్యాయమైన కోర్కెలకు తమ మద్దతు నివ్వవలసిందిగా ప్రజా సంఘాలకు రాజమండ్రి పట్టణ పౌరహక్కుల సంఘ అధ్యక్షులు యేలూరి సూర్యారావుగారు విజ్ఞప్తి చేసారు.

31-10-77న యేలూరి సూర్యారావుగారు మళ్ళీ యిలా రాసారు.

"రాజమండ్రి సెంట్రల్ జైలు వార్తలు దినపత్రికలలో వచ్చాక పై అధికారులు ఉదయం టిఫిన్, మధ్యాహ్నం - సాయంత్రం భోజనం ఏర్పాటు చేసారు. మిగిలిన కోర్కెలు 1-11-77 నుండి పరిష్కరిస్తామని చెప్పారు. అందుమీదట కొంతమంది నిరవధిక నిరాహారదీక్ష మానివేసారు. హైదరాబాదు జైలుకు మార్చిన డా॥ యం.వి. రమణారెడ్డి బ్యాచు 25 మందిని, విశాఖ జైలుకు మార్చిన షేక్ కాశీషాను తిరిగి

రాజమండ్రి జైలుకు తీసుకురావాలని ఖయిదీలు కోరారు. అధికారులు నిరాకరించారు. అందువలన యింకా 40 మంది ఖయిదీలు నిరవధిక నిరాహారదీక్ష 24 తేదీ నుండి యీనాటి వరకు చేస్తూనే వున్నారు."

రాజమండ్రి జైలు సూపరింటెండెంటు నిరంకుశ వైఖరికి నిరసనగా, ఖయిదీల పోరాటానికి మద్దతుగా హైదరాబాదు సెంట్రల్ జైల్లో డాక్టర్ ఎం.వి. రమణా రెడ్డితో పాటు 13 మంది రాజకీయ ఖయిదీలు, ఇద్దరు సాధారణ ఖయిదీలు ఆమరణ నిరాహారదీక్ష చేస్తున్నట్లుగా రాష్ట్ర జనతా పార్టీ కార్యదర్శి ఎ. చక్రధర్‌గారు రాష్ట్ర పౌర హక్కుల సంఘం కన్వీనర్ ఎం. రంగనాధంగారు నవంబర్ 1వ తేదీన ప్రకటించారు.

## పత్రికా స్వాతంత్ర్యం ?!

శ్రీకాకుళ పోరాటం ఉధృతంగావున్న రోజుల్లో ఆ ప్రాంతానికి డిఐజి (నక్సలైట్స్)గా వుండి వెంపటాపు సత్యం, ఆదిభట్ల కైలాసం మొదలయిన మార్క్సిస్ట్-లెనినిస్ట్ పార్టీ నాయకుల వధలకు బాధ్యుడై, ఎమర్జెన్సీ కాలంలో రాష్ట్రంలో బహుశా దేశంలోనే మొదటిసారిగా ఐపిఎస్ ఆఫీసరు హోం సెక్రటరీగా నియమించబడి వెంగళరావు హంతక ప్రవృత్తిని అంతకునిలాగే నిర్వహించిన ఎం.వి. నారాయణరావు బహుశా బదిలీ అవుతాడు అని ఊహించాడు ఢిల్లీలోవున్న డెక్కన్ క్రానికల్ పత్రిక ప్రత్యేక ప్రతినిధి. వెంటనే వెంగళరావు నుంచి డెక్కన్ క్రానికల్ పత్రికాధిపతులకు ఫోన్ పోయింది. 'మీకా రోగ్ కావాలో నేను కావాలో ఎంచుకోండి' అని. ఆ పత్రికా విలేఖరి చాల సమర్థుడు. యాజమాన్యానికి అతనిపై గురివుంది. వెంగళరావు ముఖ్యమంత్రి. ఆయనమాట ఎట్లా జవదాటడం. అందుకని తాత్కాలికంగా 'నిర్బంధ సెలవు' తీసుకోవాల్సిందిగా సలహా యిచ్చారు. అది ఆయనకు వరం లాంటి శాపం అయింది. ఆంధ్రప్రదేశ్‌కు వచ్చి తార్కుండే కమిటీ నక్సలైట్లవధల విషయంలో సేకరిస్తున్న సాక్ష్యాల విషయమూ, ఆ కమిటీ రిపోర్టులలో బయటపడిన రాష్ట్ర పోలీసుల హత్యా నేరాలు, అందుకు రాజకీయ బాధ్యత వహించిన వెంగళరావు హింసాచర్యలను లోతుగా సన్నిహితంగా అధ్యయనంచేయగలిగాడు. ఫలితమే 'హంతకులెవరు ?' అనే పుస్తక రచన. అందులో నక్సలైట్లను హంతకులుగా ఆరోపిస్తున్న వెంగళరావూ ఆయన అనుచరులే హంతకులని ఉపపత్తితోసహా వాదించాడు.

దీనితో నిప్పుతొక్కిన కోతిలాగా ఆ పత్రికా విలేఖరి ఉద్యోగానికే ఉద్వాసన చెప్పించాడు వెంగళరావు. ఇటీవలనే డక్కన్ క్రానికల్ యాజమాన్యం ఆ విలేఖరిని ఉద్యోగం నుంచి తొలగిస్తూ కాగితం పంపించారు. అయితే అందులో మిమ్మలను ఉద్యోగం నుంచి తొలగించాల్సి వస్తున్నందుకు విచారిస్తున్నాం. ఇది ఏ విధంగానూ మీ పత్రికా రచన సామర్థ్యంపై భిన్నాభిప్రాయం కాదు- మీరు పత్రికకు చేసిన సేవలకు అభినందనలు అని రాసారు. అంటే దీని అర్థం ఏమిటి? ఇట్లా ఉద్వాసన చెప్పాల్సిన పరిస్థితి ఎవరు కల్పించారు? పత్రికా రచన స్వేచ్ఛ అనేది ఆంధ్రప్రదేశ్‌లో జలగం వెంగళరావు దయా ధర్మాలమీద ఆధారపడి వున్నదనే దానికి ఇది ప్రత్యక్ష తాజా నిదర్శనం.

అయితే ఒక పత్రికారచయితకు ఇంత అన్యాయం జరుగుతుంటే ఒక్క తెలుగు పత్రిక అయినా ఖండించలేదు సరికదా ఆ వార్తను ప్రకటించనైనా లేదు. కలకత్తా నుంచి వెలువడే 'సండే' వారపత్రిక మాత్రమే ఈ వార్తను వివరంగా ప్రకటించి ఆంధ్రప్రదేశ్‌లో పత్రికలు, రేడియోపై వెంగళరావు, పోలీసులు ఇంకా ఎన్ని ఆంక్షలు పెడుతున్నారో ఆ చేదు నిజాలు బయటపెట్టింది. ఇంతకూ ఎవరీ డెక్కన్ క్రానికల్ న్యూఢిల్లీ ప్రత్యేక ప్రతినిధి. ఖమ్మం జిల్లా వాసి, నవయువకుడు ఆదిరాజు వెంకటేశ్వరరావు- ఆయనకు జరిగిన అన్యాయం పత్రికా స్వాతంత్ర్యానికే గొడ్డలిపెట్టు. ఆదిరాజు వెంకటేశ్వరరావును ఉద్యోగం నుంచి తొలగించిన విషయాన్ని ఆంధ్రప్రదేశ్‌లో పత్రికలపై ఇంకా ఎమర్జెన్సీ సెన్సార్‌షిప్ కొనసాగుతున్న దనడానికి నిదర్శనంగా ఉదహరించిన జనతాపార్టీ నాయకుడు సురేంద్రమోహన్ ప్రకటనను (చూ. స్టేట్స్‌మన్ 30-10-77) రాష్ట్రంలో ఏ పత్రికలూ వేయలేదు। మీరయినా ఈ లేఖను ప్రచురించి వెంగళరావు తాఖీదులకు, బెదిరింపులకు, సెన్సార్ కత్తెర్లకు లొంగరనే మా ఆశను నిలుపుతారని ఆశిస్తూ –

— ఒక పత్రికా రచయిత

---

సృజన ఎడిటర్, పబ్లిషర్ హేమలతకు వరంగల్ సెషన్స్ జడ్జ్ వీరభద్రరావుగారు విధించిన రెండు సంవత్సరాల జెయిలు శిక్షకు వ్యతిరేకంగా ఆమె అపీల్ చేసుకోగా రాష్ట్ర హైకోర్ట్ జడ్జ్ జయచంద్రారెడ్డిగారు ఆమె అపీల్‌ను ఆమోదిస్తూ ఆమె 'నిర్దోషి' అని అక్టోబర్ 7వ తేదీన తీర్పు యిచ్చారు. హేమలత తరఫున న్యాయవాది పద్మనాభరెడ్డిగారు వాదించారు.

మొదటిసారిగా తెలుగులో



# మావో రచనలు

మొదటి సంపుటి వెలువడింది

డెమ్మి 460 పేజీలు

వెల: రు. **15**

కాపీలకు :

1) క్రాంతి ప్రచురణలు,
6-15-35, 15వ లైను
అరండల్ పేట, గుంటూరు - 2

2) సృజన,
హనుమకొండ, వరంగల్ - 506 001

Edited, Printed & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu'
Printed at Venkataramana Mudranalayam.
J.P.N. Road, Warangal - 506002 (A.P.)
Working Editor Varavararao

SRJANA Telugu Monthly Nov. 77 H/WL-10
Regd. No. with Registrar of News Papers 10953/67

## కామ్రేడ్స్, స్వేచ్ఛకోసం ప్రాణాలర్పించిన వారిని స్మరిద్దాం.

మరణాంతకమైన పోరాటంలో మీరు నేలకొరిగారు.
ప్రజల స్వేచ్ఛకోసం, ప్రజల ప్రతిష్ఠకోసం
మీకు ప్రియమయిందంతా వదులుకున్నారు
మీ ప్రాణాలు యిచ్చేసారు
మీరు భయంకరమైన జెయిళ్ళలో బాధలనుభవించారు
సంకెళ్ళు వేసుకొని ప్రవాసానికెళ్ళారు...

బాధపడుతున్న మీ సోదరులను ఉపేక్షించలేకపోయారు గనుక
కత్తికన్నా న్యాయం శక్తివంతమైందని విశ్వసించారు గనుక
ఒక్క పలుకయినా లేకుండా మీరు సంకెళ్ళు సహించారు...

మీరు అర్పించిన అసువుల విలువ తెలిసే కాలం వస్తుంది,
ఆ సమయం సమీపంలోనే వుంది;
నిరంకుశత్వం పతనమైనపుడు ప్రజలు స్వేచ్ఛగా, ఉన్నతంగా లేస్తారు.

వీడ్కోలు, సోదరులారా, మీరు ఉత్తమ మార్గాన్ని ఎంచుకున్నారు
స్వాతంత్ర్యం కోసం, ప్రజల సంతోషం కోసం పనిచేస్తామని
మీ సమాధివద్ద మేం పోరాడే ప్రతిజ్ఞ తీసుకుంటున్నాం...

[1917 నవంబర్ 8న రష్యన్ ప్రజలు తమ మృతవీరుల గురించి పాడుకున్న వీడ్కోలు గీతం – FUNERAL MARCH]

SRJANA
Hanamkonda
Warangal - 506 001

Yearly Subscription
Rs. 15/-

This issue
2 Rs.